


మనువాదం మతోన్మాదం సదస్సు : విజయవాడ



ఆక్వా ఫుడ్ పార్క్‌కు వ్యతిరేకంగా జాతీయ రహదారిపై నిరసన :పశ్చిమగోదావరి



స్థానిక సమస్యలపై మున్సిపల్ కమిషనర్‌కు వినతిపత్రం : కర్నూలు




అధిక ధరలను నిరసిస్తూ ప్రదర్శన : నెల్లూరు




లింగ నిష్పత్తి పి.సి.పి.ఎన్.డి.టి. యాక్ట్‌పై మాట్లాడుతున్న పి.డి.నిర్మల : గుంటూరు




లింగ నిష్పత్తి పి.సి.పి.ఎన్.డి.టి. యాక్ట్‌పై మాట్లాడుతున్న శ్రీమతి వాణి : విశాఖ



ఆదిలక్ష్మీ హత్యకేసు విచారణ చేస్తున్న డీఎస్పీ పెదతాళ్ళపాలెం : తూ॥గో॥



రిషితేశ్వరి సంస్మరణ సభ ప్రభుత్వ జూనియర్ కాలేజీ ప్రిన్సిపల్ సి.ఆర్.రెడ్డి : విజయవాడ

సంపాదకీయం

చైతన్య మానవి

# పుష్కరాలు ఎందుకోసం?

**పు**ష్కరాల జ్వరం తెలుగు రాష్ట్రాలను ముంచెత్తుతోంది. కృష్ణా జలాల్లో మునిగి పాపాలు కడిగేసుకోమని ప్రభుత్వ యంత్రాంగం భారీ ఏర్పాట్లు చేస్తోంది. ఉద్యోగులందరూ పంచెకట్టాలని, విబూధిపెట్టాలని, నమ:శివాయ, గోవింద అంటూ పలకరించాలని హుకుంజారీ అయింది. ప్రత్యేకహోదా, రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ చట్టంలోని అంశాల హామీలు, వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధి వంటి అంశాల అమలులో కనిపించని టిడిపి, బిజెపి స్నేహ ఫలితాలు పుష్కరాల్లో మాత్రం సౌరభాలను వెదజల్లనున్నాయి. మానవహక్కులు, మహిళల భద్రత ఏమాత్రం పట్టించుకోనివారు స్వాములు, సన్యాసులు, బాబాలను ప్రత్యేకంగా ఆహ్వానించి వారి సేవలో తరించడానికి పోటీపడుతున్నారు.

కార్యా కారణ సంబంధాలను అన్వేషించిన బుద్ధుడి 125 అడుగుల విగ్రహాన్ని నిర్మించనున్న ప్రభుత్వం విద్వేషాలను రెచ్చగొట్టడమే లక్ష్యంగా పనిచేసేవారితో కలిసి మూఢ విశ్వాసాల చెత్తను, మురికిని ఎందుకుపోగేస్తోంది? ఎందుకీ పుష్కరస్నానాలు? వాటి పేరుతో చేసే హడావిడి విన్యాసాలు? నదీ తీరాలు అత్యున్నత మానవ వికాసకేంద్రాలుగా భాసిల్లాయి. శాస్త్రావిష్కరణతో ప్రకృతి రహస్యాలను ఛేదించి ముందుకు సాగుతున్నాడుమనిషి. మూఢభక్తి స్థానంలో హేతువు పైచేయి సాధిస్తోంది. కానీ అధికారాన్ని పొంది, సంపదలను సొంతం చేసుకున్న శక్తులకు ఈ పరిణామాలు మింగుడు పడటంలేదు. ప్రజలందరికీ సంపదలో న్యాయమైన వాటా ఎందుకులేదని, ఎందుకీ అన్యాయాలని ప్రశ్నించే ప్రజలను కర్మ, పాపపుణ్యాలు, పునర్జన్మ పేరిటనమ్మించే ప్రయత్నం మెగాస్థాయిలో సాగుతోంది. అజ్ఞానం నుండి వచ్చిన సాంప్రదాయాలను పాలకులే పెంచిపోషిస్తున్నారు. పుక్కిటి పురాణాలను ప్రచారం చేస్తున్నారు. అహల్యను చెరబట్టిన ఇంద్రుడు పుష్కర స్నానమాచరించి పాపవిముక్తుడయ్యాడని పురాణగాథ. మరొకరి భార్యను మోహించి, మోసగించే దుర్మార్గులకు కూడా పుణ్యంవస్తే ఇక అత్యాచార నిందితులను శిక్షించడమెందుకు?

పురుషుల కోసమే స్త్రీలని చెప్పే మను వాదాన్ని మన్నిద్దామా? ఆడ,మగా ఒకటేనని, ఒకరు లేనిదే మరొకరు లేరని చెప్పే ఆధునిక ధర్మ, న్యాయశాస్త్రమైన రాజ్యాంగాన్ని గౌరవిద్దామా? పతిసేవ పరమపవిత్రమనీ, భర్త చనిపోతే ఆమె ముఖంచూడరాదనే దుస్సాంప్రదాయాలను సాగనిద్దామా? భర్త ఆయురారోగ్యాల కోసం పుష్కర పూజచెయ్యాలని ప్రచారం సాగిస్తున్నారు. పురుషుల ఆయురారోగ్యాల కోసం స్త్రీలు పూజ చేస్తే మరి స్త్రీల ఆరోగ్యం కోసం పురుషులు పూజలు చెయ్యాలా? వద్దా? భార్యభర్తలు ఒకరికోసం మరొకరా? లేక యజమాని సేవకురాలుగానే ఉండాలా? నెలసరితోనే దేవదేవుడికైనా జన్మనిచ్చే తల్లికి అపవిత్రత ఏమిటి? పురుషులు మాత్రమే స్వర్గారోహణచేస్తారా? పిండం పెట్టేదాకా తల్లిదండ్రులు నదీతీరాలలో తిరుగుతుంటారా? సంవత్సరానికొక్కసారి ఒక్కోనదికి పుష్కరుడువస్తే తల్లిదండ్రుల ఆత్మలుకూడా సం॥రానికి ఒక్కో నది చుట్టూ తిరుగుతుంటాయా? పితరులకు పిండం మగ పిల్లవాడే పెట్టాలా? ఆడపిల్లపెడితే స్వీకరించరా? ఆడపిల్లల్ని కన్న తల్లిదండ్రులు పిండం దొరక్క వారి ఆత్మలు భూలోకం చుట్టూ పరిభ్రమిస్తుంటాయా?

లక్షలాది ప్రజానీకాన్ని ఒకచోట చేర్చిమూఢత్వాన్ని పెంచిపోషించే ప్రయత్నాలను నిలువరిస్తేనే ఆరోగ్యం, ఆనందం, స్వచ్ఛత, విముక్తి. పూజలపేరిట పోగుపడే వ్యర్థాలు, కాలుష్యం, ప్లాస్టిక్ నుండి, మనుషులు లక్షలాది చేరితే వచ్చే విసర్జనాల నుండి రక్షించుకునేందుకు విజ్ఞత కలిగిన వాళ్లందరమూ చేయి కలుపుదాం. విజ్ఞానాన్ని అందిపుచ్చుకోగలిగే శాస్త్రీయ భావాల పరిమళాలను వెదజల్లుదాం! అవరోధాలను అధిగమించి ప్రకృతిని, పరిశుభ్రతను రక్షించుకుందాం..స్వచ్ఛజలాలను కాపాడుకుందాం.

# చైతన్య మానవి



## ఈ సంచికలో




## అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం ఎ.పి. రాష్ట్ర కమిటీ



చిరునామా :
ఐద్వా రాష్ట్ర కార్యాలయం,
కల్పన ప్రింట్స్ రోడ్, కృష్ణలంక,
విజయవాడ.
ఫోన్, 9490098620, 9490098022
E-mail : Chaitanyamanavi@gmail.com





**విరాళం రూ : 10/-**

ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్,
కృష్ణనగర్, తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా

వ్యాసం

# జిషా హత్య కేసు - ఊరట

- బృందాకరత్

కేరళలో ఒక న్యాయ విద్యార్థినిపై అతి క్రూరంగా అత్యాచారం జరిపి హత్య చేసిన నేరస్థుడిని కేరళలోని ప్రత్యేక దర్యాప్తు బృందం అరెస్టు చేసిందనే వార్త తెలిసినపుడు ఎంతో బాధతో కృంగిపోతున్న ఆమె తల్లికి కొంత ఊరట కలిగింది. నేరస్థుడిని కనిపెట్టి అతన్ని అరెస్టు చేయడానికి పట్టుదలతో కృషి చేసిన ఆ దర్యాప్తు బృందాన్ని అభినందించాలి.

ఆ రోజు ఏప్రిల్ 28వ తేదీ. రాజేశ్వరి తన పని ప్రదేశం నుండి ఇంటికి చేరి ఇంటి తలుపు తట్టగా లోపలి నుండి ఏ విధమైన సమాధానం లేదు. ఆ సమయంలో ఆమెకు తన కూతురు అతి క్రూరంగా చంపబడి వెనుకనున్న చీకటిగదిలో నిర్జీవంగా పడివున్నదని తెలియదు.

కేరళలో వామపక్ష ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తరువాత మొట్టమొదటిగా తీసుకున్న నిర్ణయం హత్యకు గురైన జిషా కేసును దర్యాప్తు చేయడానికి ఒక సీనియర్ మహిళా అధికారి ఆధ్వర్యంలో ఒక ప్రత్యేక దర్యాప్తు బృందాన్ని ఏర్పాటు చేయడం, ఇంతకు ముందున్న యు.డి.ఎఫ్ ప్రభుత్వం ఈ కేసులోని సాక్ష్యాధారాలను చాల వరకు నాశనం చేసిందనీ చాలా మంది చెప్పారు. ఈ కేసులో ఒక ముఖ్యమైన పోలీసు ఆఫీసరును నియమించాల్సిన అవసరం ఉందని కూడా అప్పటి ప్రభుత్వం ఆలోచించలేదు. ఘటన జరిగిన స్థలంలోని ఆధారాలు సమసిపోకుండా ఉండేందుకు ఏ విధమైన చర్యలూ చేపట్టలేదు. అక్కడ



ఏవిధమైన సోదాలూ జరుపలేదు. రైల్వే స్టేషన్లకూ, బస్టాండ్‌లకూ బృందాలను పంపి నేరస్థులను పట్టుకునే ప్రయత్నాలు ఏమాత్రం చేపట్టలేదు. దర్యాప్తు క్రమంలో చేయవలసిన కనీస ప్రయత్నాలు ఏమీ చేయలేదు.

పోలీసుల దృష్టిలో ఈ కేసుకు ఏ మాత్రం విలువ లేదు. ఈ కేసులో బాధితురాలు మహిళలు మాత్రమే ఉన్న ఒక కుటుంబానికి చెందిన ఒక పేద, దళిత మహిళ. వర్గ, కుల, లింగ వివక్షతలు కలగలిసిన ఇటువంటి కేసులలో బాధిత కుటుంబాల వారు అన్యాయాన్ని ఎదిరించలేని పరిస్థితులకు నెట్టబడతారు.

రాజేశ్వరి ప్రస్తుతం ఇంకా ఆసుపత్రిలోనే వుంటూ కోలుకుంటుంది. వామపక్ష ప్రభుత్వం ఆమెకు పొరుగున వున్న పంచాయితీ ఏరియాలో ఒక ఇల్లు కట్టించింది. దానితోపాటు ఆమెకు నెలకు రూ॥5000/- ప్రభుత్వ పెన్షన్ అందించే ఏర్పాటు చేసింది. ఆమె ఇంకొక కూతురు దీప కూడా ఆమెతో వుండే ఏర్పాటు చేసి ఆమెకు అక్కడి తాలూకా ఆఫీసులో అటెండెంటుగా ప్రభుత్వ ఉద్యోగం ఇచ్చింది. బాధిత కుటుంబానికి తక్షణ సహాయం అందించడాన్ని తన ఎజెండాలో ప్రధాన అంశంగా ప్రభుత్వం ఎంచుకోవడం ఆహ్వానించదగిన విషయం. రోహిత్ వేముల కేసులో దీనికి పూర్తి భిన్నంగా జరుగుతోంది. రోహిత్ కుటుంబం విషయంలో రోహిత్ తల్లికి కానీ, ఎంతో ప్రతిభావంతుడైన అతని సోదరుడు రాజాకు కానీ అటు తెలంగాణ ప్రభుత్వం నుండి కాని, ఇటు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నుండి కానీ ఏవిధమైన సహాయమూ అందలేదు. కానీ రాజేశ్వరి విషయంలో ప్రభుత్వం సత్వరం స్పందించింది. రాజేశ్వరి చాలా కోపంతో విచారంతో ఉంది. ఆమె తన కూతురికి న్యాయం జరగాలని మినహా మరేమీ కోరడం లేదు.

రాజేశ్వరి తన జీతవితమంతా వ్యధాభరితమేనని చెబుతుంది. ఒక పేద కుటుంబంలో పుట్టిన ఆమె తన తోబుట్టువులందరిలోకి పెద్దది. ఆమె తల్లి మూడు వివాహాలు చేసుకోగా ఆమె సంతానమందరిలోకి రాజేశ్వరి పెద్దది.

**కేరళలో వామపక్ష ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తరువాత మొట్టమొదటిగా తీసుకున్న నిర్ణయం హత్యకు గురైన జిషా కేసును దర్యాప్తు చేయడానికి ఒక సీనియర్ మహిళా అధికారి ఆధ్వర్యంలో ఒక ప్రత్యేక దర్యాప్తు బృందాన్ని ఏర్పాటు చేయడం. ఇంతకు ముందున్న యు.డి.ఎఫ్ ప్రభుత్వం ఈ కేసులోని సాక్ష్యాధారాలను చాల వరకు నాశనం చసిందనీ చాలా మంది చెప్పారు. ఈ కేసులో ఒక ముఖ్యమైన పోలీసు ఆఫీసరును నియమించాల్సిన అవసరం ఉందని కూడా అప్పటి ప్రభుత్వం ఆలోచించలేదు. ఘటన జరిగిన స్థలంలోని ఆధారాలు సమసిపోకుండా ఉండేందుకు ఏ విధమైన చర్యలూ చేపట్టలేదు.**

రాజేశ్వరి తన 13వ ఏట నుండే పనిచేస్తూ తన సోదరులనూ, వేరే తండ్రికి పుట్టిన పిల్లలనూ పోషించడంలో సాయపడేది. తరువాత రాజేశ్వరి కుటుంబ సాంప్రదాయాలకు భిన్నంగా ఒక దళిత వ్యక్తిని వివాహం చేసుకోవడంతో తన అన్నదమ్ముల నుండే కాక ఆడపడుచుల నుండి కూడా అనేక వేధింపులనెదుర్కోవాల్సి వచ్చింది. ఆ వేధింపులు ఆమె వివాహ బంధం తెగిపోయిన తరువాత కూడా కొనసాగాయి. ఆమె తన కుమార్తెలు జిషా మరియు పెద్ద కుమార్తె దీపలను అదనపు షిఫ్టులో పనిచేస్తూ పెంచి పెద్ద చేసింది. ఉదయం పూట ఒక ఆసుపత్రిలో పనిచేస్తూ సాయంత్రం ఒక మహిళల సహకార కేంద్రంలో పనిచేసేది. అంతేకాక ఆమె వ్యవసాయ పనులు కూడా చేసేది. ఆమె చాలా ఎక్కువ గంటలు పనిచేసేది. ఆమె మాటల్లో చెప్పాలంటే ఇదంతా తన కూతుర్లు తనలా కష్టపడరాదని చేస్తున్నానని చెప్పేది. విద్య ద్వారా మంచి జీవితం పొందవచ్చని ఆమె గట్టిగా నమ్మేది.

అందుచేత ఆమె పెద్ద కూతురు తనతో చెప్పకుండా ఒక ఉన్నత కులాల అబ్బాయిని పెళ్ళిచేసుకోవడం, చదువు అసంపూర్తిగా వదిలివేయడం ఆమెను ఎంతో కృంగ దీసింది. ఇంకొక కూతురు దీప వివాహం కూడా విచ్ఛిన్నమైంది. ఆమె తన తల్లి ఇంటికి రాకుండా తన పసిపిల్లవాడితో మేనమామ ఇంటికి వెళ్ళింది. కనుక తల్లీ కూతుళ్ళు రాజేశ్వరి, జిషా మాత్రమే ఒక చిన్న ఇంట్లో నివసిస్తున్నారు. ఆ ఇల్లు ఒక పొడవైన గది. అది మూడు భాగాలుగా చేయబడి వున్నది. పెరియార్ నదీ తీరాన ఒక ప్రభుత్వ స్థలంలో ఆ ఇల్లు వున్నది. ఆ సన్నని నదీ తీరంలో మొత్తం 26 కుటుంబాలు నివసిస్తున్నాయి. అందులో 23 కుటుంబాలు దళిత కుటుంబాలు. అక్కడ వున్న ఇళ్ళన్నీ ప్రక్క ప్రక్కనే ఆనుకొని వుంటా యి. కానీ రాజేశ్వరి ఇల్లు మాత్రం వేరొక ప్రక్క వుంటుంది. ఇరుగు పొరుగు వారికి దూరంగా ఒక మూలకు వుంటుంది. మిగిలిన వారికి నీటి సౌకర్యం అందుబాటులో వుంది. కానీ రాజేశ్వరికి నీటి కనెక్షన్ లేదు. అందువలన ఆమె కానీ, జిషా కానీ నీటికోసం దూరంగా వున్న పబ్లిక్ పంపు వద్దకు వెళ్ళడం కానీ లేక పొరుగువారి బావి వద్ద నుండి తెచ్చుకోవడం కానీ చేసేవారు. ఇది స్పష్టమైన వివక్షతకు నిదర్శనం.

పంచాయితీ వారి జాబితాలో రాజేశ్వరి కుటుంబం దారిద్ర్యరేఖ దిగువకు చెందినదని నమోదై వున్నప్పటికీ తాలూకా ఆఫీసు వారు వారికి రేషన్ కార్డు ఇవ్వలేదు. ఆ విధంగా వారికి నీళ్ళు, సబ్సిడీ ఆహార సరుకులూ రెండూ అందుబాటులో లేకుండా పోయాయి. ఆమె స్వయంగా దళితురాలు కాకపోవడంతో ఎస్.సి పథకాలు ఏవీ ఆమెకు అందుబాటులో లేవు. అప్పటి ఒక ఎమ్.ఎల్.ఏ జోక్యంతో ఆ యిల్లు ఆమెకు కేటాయించబడింది. అప్పటి ఇంటి నిర్మాణ పథకం అనేక రూపాయలను ఇంటి నిర్మాణానికి కేటాయించి అదికూడా వాయిదాల పద్ధతిలో విడుదల చేస్తూ లబ్దిదారులను అప్పులు చేసి ఇంటి నిర్మాణం ఒకేసారి చేపట్టాలని నిబంధనలు పెట్టారు. రాజేశ్వరి ఇంటి నిర్మాణం సగంలో ఆగిపోయింది.

దీనికి తోడు ఒంటరిగా వున్న ఆమె ఇంకా అనేక కష్టాలను ఎదుర్కొంది. డిగ్రీ పూర్తి చేసిన ఆమె కూతురికి కాలేజీ వారు ప్రొవిజనల్ సర్టిఫికెట్ మాత్రమే ఇచ్చారు. యూనివర్శిటీవారు చివరి డిగ్రీ సర్టిఫికెట్ ఇంతవరకూ ఇవ్వలేదు. ఇది ఆమెకు ఎంతో బాధ కలిగించింది. ఆమె కులాంతర వివాహం చేసుకున్నందుకు కూడా అనేక కష్టాలు ఎదుర్కొవాల్సి వచ్చింది. ఆమెకు బంధువులతో వారి కుటుంబాలతో సంబంధాలు లేకుండా పోయాయి. గత అనేక సం॥లుగా ఆమె తన శక్తినంతా కూడదీసుకొని రోజువారీ ఎదురవుతున్న అనేక సమస్యలను పరిష్కరించుకుంటూ వస్తోంది. దీనితో ఆమెలో నిరాసక్తత నెలకొంది.

కొద్ది నెలల క్రితమే అక్కడి పంచాయితీ ఎన్నికలలో వామపక్ష కూటమి (ఎల్.డి.ఎఫ్) గెలిచింది. ఆ పంచాయితీ ప్రెసిడెంటు మంచి వాక్చాతుర్యం కలిగిన ఒక దళిత మహిళ. ఆమె అక్కడికి 2కిలో మీటర్ల దూరంలో నివసిస్తుంది. సిజు సాజు అనే ఇంకొక వార్డు సభ్యురాలు ఆ దగ్గరలోనే వుంటుంది. రాజేశ్వరికి మంచినీటి కనెక్షన్ లేక పోవడం అన్యాయమని భావించిన వీరు

దానికోసం ప్రయత్నించారు. ఈ ఇద్దరు మహిళలతో పాటు మిగిలిన పంచాయితీ సభ్యులందరూ కలిసి జిషాకేసును పోలీసుల దృష్టికి తీసుకురావడమే కాక హత్య సంఘటనతో షాక్‌కు గురయిన రాజేశ్వరిని ఆసుపత్రికి తరలించారు. అవాస్ అనే పంచాయితీ సభ్యురాలు జిషా శరీరాన్ని ముందుగా గుర్తించి అది ఒక క్రూరమైన హత్య అని మొదటిగా చెప్పింది. పోలీసులు అది ఒక ఆత్మహత్య అని చిత్రించే ప్రయత్నం చేయగా ఆమె దానిని అడ్డుకుంది.

జైతోయిష్ అనే ఇంకొక వార్డు సభ్యురాలు చొరవ తీసుకొని దీప యజమానితో మాట్లాడి దీపను ఆసుపత్రిలో వున్న ఆమె తల్లి వద్దకు తీసుకువచ్చింది.

పోలీసులు కనీసం మృతురాలిని పోస్ట్‌మార్టం కోసం తరలించేందుకు ఒక అంబులెన్స్‌ను ఏర్పాటు చేయడానికి కూడా నిరాకరించారు. ఈ విషయంలో కూడా పంచాయితీ సభ్యులే పూనుకొని తగిన ఏర్పాట్లు చేశారు. పోలీసుల నిర్లక్ష్యానికి వ్యతిరేకంగా వీరు నిరసన కార్యక్రమం చేపట్టారు. ఇటువంటి కేసులలో ఆర్.డి.ఒ కూ,జిల్లా అధికారులకూ ఖచ్చితంగా సమాచారం ఇవ్వాల్సి వుంది. కానీ పోలీసులు అందుకు నిరాకరించడంతో వీరు పెద్ద ఎత్తున నిరసన తెలిపారు. కేసు దర్యాప్తు విషయంలో సహకరించడానికి అక్కడి స్థానికులు తటపటాయిస్తున్న సందర్భంలో పంచాయితీ సభ్యులే చొరవ తీసుకొని దర్యాప్తులో కీలక పాత్ర పోషించారు. రాజేశ్వరి కుటుంబం లాంటి కుటుంబాలు సామాజిక వెలికి గురికాకుండా వుండాలంటే సామాజిక స్పృహ వున్న ఇటువంటి వారి జోక్యం మరింత పెరగాలి.


ఇళ్ళు కట్టించి ప్రారంభిస్తున్నచేస్తున్న కేరళ ముఖ్య మంత్రి పినరై విజయన్

రాజేశ్వరిని తీవ్ర నిరాశానిస్పృహలు ఆవరించడానికి అనేక కారణాలు వున్నాయి. ఒక పేద స్త్రీ ఆధారిత కుటుంబానికి చెందిన రాజేశ్వరి నిజజీవితంలో సామాజికంగా, ఆర్థికంగా మరియు కులం విషయంలోనూ చేదు అనుభవాలనూ చవిచూసింది. ఇది ఒక సామాజిక సమస్య దీనికి ప్రత్యామ్నాయ విధానాల ద్వారానే న్యాయం జరుగుతుం దనేది వాస్తవం.

కాలువ గట్ల వెంట పట్టాలు కూడా లేకుండా నివసించే కుటుంబాలు ముఖ్యంగా దళిత కుటుంబాలు సురక్షిత మైన భద్రత కలిగిన వాతావరణంలో వుండాలంటే వారికి కనీస అవసరాలైన కరెంటు, పారిశుధ్యం, నీటి వసతులతో పాటు గౌరవంగా విద్యనభ్యసించే హామీ మరియు సామాజిక వివక్షకు దారితీస్తున్న కులాచారాలను నిర్మూలించాల్సిన అవసరం వుంది.

ప్రత్యేకించి కేరళ లాంటి రాష్ట్రం లో ఎక్కువ మంది ప్రజలు ఇటువంటి హక్కు లను సాధించుకోవడం జరిగినా కూడా రాజేశ్వరి ఎదుర్కొంటున్న వివక్షతనూ, అణచివేతనూ ఆమె వ్యక్తిగత సమస్యలా కాకుండా దళితులకూ, గిరిజనులకూ, అణగారిన వర్ణాలకూ మరింత పటిష్టమైన విధానాల అవసరం వున్నదనే విషయంపై దృష్టి సారించాల్సి వుంది. అనేక ప్రాంతాలలోనా దళిత, గిరిజన తెగలవారు ఎటువంటి దుర్భర పరిస్థితులలో జీవనం సాగిస్తున్నారో పరిశీలిస్తే వారికోసం తక్షణ చర్యలు చేపట్టాల్సిన అవసరం ఎంతోవుందని తెలుస్తుంది.

యువతిని అతికిరాతకంగా ఆ నేరస్తుడు చంపాడు. అతని చర్యలు అమాన వీయమైనవి. నేరస్తుడిని ఫాస్ట్‌ట్రాక్ కోర్టు ద్వారా విచారించి శిక్షించాలి. ఈ కేసు విషయంలో మతోన్మాద శక్తులు నేరస్థుడి మతాన్నీ, అతను వలస వచ్చి పని చేయడాన్నీ ఉపయోగించుకొని వేరొక విధమైన మత ఎజెండాను ముందుకు తెస్తారనడంలో సందేహంలేదు. దీనిని అనుమతించరాదు. జిషాకేసులో తలెత్తిన అనేక అంశాలు సరైనరీతిలో పరిష్కరింప బడాలంటే ఒక ప్రత్యామ్నాయ విధానాల రూపకల్పన అవసరమనే విషయంపై మనం పోరాడాల్సి వుంది. కాలువలోని మురికి నీటినుండి, దాని నుండీ వచ్చే నష్టాల నుండీ తప్పించుకొని దూరంగా వెళ్ళాలనుకొనే తన తల్లి కోరికనూ, తన కోరికనూ నెరవేర్చుకొనే ప్రయత్నంలో తన ప్రయాణం మధ్యలోనే నేలకొరిగిన యువతికి ఈ విధమైన ప్రత్యామ్నాయ రాజకీయ విధానాలు మాత్రమే న్యాయం చేకూర్చగలవు.

–అనువాదం, కె.నాగలక్ష్మి

మణిపూసలు

# మధుర గాయని పి. సుశీల

- వకుళాభరణం లలిత

నేను 1950వ దశకంలో చెన్నై లేడీ విల్లింగ్టన్ హైస్కూల్లో చదివేటప్పుడు, మా పాఠశాలకు స్నేహితురాలితో కలిసి ఒక 'అమ్మాయి' వచ్చింది. అప్పటికింకా ఆమె నేపథ్య గాయనీమణి కాలేదు. దాదాపు 11,000 పాటలను తెలుగులో గానం చేసిన మధుర గాయని అనీ, సుమారు 7,000 పాటలను తమిళ సినిమాలకు పాడుతుందనీ, మలయాళం, కన్నడం, మిగతా భాషల్లో వేయికి పైగా పాటలు పాడి, జాతీయ అవార్డులను ఐదుసార్లు కైవసం చేసుకొంటుందనీ ఆనాడు ఎవ్వరైనా ఊహించారా? లేదు. ఆమె కుటుంబ సభ్యులు కూడా ఆమె ఇంత గొప్ప నేపథ్య గాయనీమణి అవుతుందని ఊహించలేదు. అప్పట్లో ఆమెను కలిసిన తమిళ గాయనీమణి డి.కె.పట్టమ్మాళ్ కూడా నేపథ్యగాయనిగా ముందుకు పొమ్మని ఇతరుల్లాగే ప్రోత్సహించినవారే.

మలయాళ సినిమా డైరెక్టర్ (గోవిందవర్ధన్) ఆమె పాడతానని సంతకం పెడ్తేనే తాను ఆ సినిమాకు డైరెక్టర్‌గా ఉంటానని చెప్పటం సుశీల గొప్పతనానికి ప్రబల నిదర్శనం. స్వరబద్ధమైన సంగీతంలో నాద సౌందర్యమే శ్రావ్యత . ఆ శ్రావ్యతకు పాములు కూడా తలలు ఆడిస్తాయట! అమృతపు చుక్కలు పడ్డట్టుగా గానం చేసే శక్తి పులిపాక సుశీలకు వరమైంది. తన తీయని గానంతో మృదుమధురమైన స్వరంతో 60 సంవత్సరాలకు పైగా పాడుతున్నా, ఏ మాత్రం వన్నెతగ్గని సుస్వర లయ విన్యాసం సుశీలది.

ఎవరూ మరెవరికీ పోటీకాదు. ఎవరి స్వరం వారిదే, ఎవరి మాధుర్యం వారిదే. ఒక్కొక్కప్పుడు లతామంగేష్కర్‌ను కూడా మించిపోయే మధుర స్వరంతో పాటలు పాడిన పి.సుశీలను ఎవరితో పోల్చలేము.

సుశీలది సాహిత్యానికి, కళలకు



నిలయమైన విజయనగరం. అమర గాయకుడు ఘంటసాల సంగీత సాధన చేసిందక్కడే! ఆమె తల్లిదండ్రులే ఆమెకు తొలి సంగీత గురువులు. తండ్రి పులిపాక ముకుందరావు వృత్తిరీత్యా న్యాయవాది, కళాప్రియులు. అమ్మగారు శేషావతారం సంగీతాభిమాని. విజయనగరం వచ్చిన సంగీత కళాకారులు వారి ఆతిథ్యం స్వీకరించాల్సిందే. ముకుందరావు స్వయంగా వయొలిన్ విద్వాంసుడు. సుశీలకు ఆయనే వయొలిన్ నేర్పించారు. మురారి అనే సంగీత గురువు దగ్గర సుశీల శిక్షణ పొందారు. 1951 లోనే ఆకాశవాణి రేడియో అన్నయ్య, అక్కయ్యలు నిర్వహించిన 'బాలానందం' కార్యక్రమాల్లో సభ్యురాలైన సుశీల, చిన్నపిల్లల సినిమాలో పాటపాడటానికి ఒప్పుకొంది. ఆ సినిమాకు సంగీత దర్శకులు పెండ్యాల నాగేశ్వరరావు. మొట్టమొదటిసారిగా పోతన భాగవతంలోని "లావొక్కింతయు లేదు" అన్న పద్యాన్ని పాడటం, అది చూచిన ఎ.వి.యం. కంపెనీ వారు 'భక్తప్రహ్లాద' సినిమాలో పాట పాడమనడంలో ఆశ్చర్య మేముంది? సంగీత కళాకారిణిగా ఒకనాటి ఎం.ఎస్.సుబ్బులక్ష్మి లాగా కచేరీలు చేయాలనీ, ఆమె స్వరం సంగీత ప్రపంచంలో మారు మోగాలనీ ఆశించారు. పెద్దలు డి.కె.పట్టమ్మాళ్, బాల మురళీకృష్ణ గార్లు సుశీల పాటలు విని సినిమాల్లో నేపథ్య గాయనిగా రాణించటంలో

## గాయని పి. సుశీల అందుకున్న అవార్డులు

- జాతీయ స్థాయిలో అత్యున్నతమైన పద్మభూషణ్ అవార్డు 2008
- ఆంధ్రా యూనివర్శిటీ నుండి డాక్టరేట్
- ఉత్తమ గాయనిగా ఐదుసార్లు జాతీయ స్థాయి అవార్డులు
- లైఫ్‌టైమ్ అచీవ్‌మెంట్ 6
- తెలుగు, తమిళ, మలయాళ బాషలలో గాయనిగా 11సార్లు రాష్ట్ర అవార్డులు
- కళా సాగర్ అవార్డు 2003
- ఉత్తమ గాయనిగా రాష్ట్ర స్థాయిలో 17 అవార్డులు పొందారు.

తప్పులేదన్నారు. ఆ రకంగా సుశీల స్వరమాధుర్యంతో ఎ.వి.యం. స్టుడియో వారితో కాంట్రాక్టు కుదుర్చుకొంది. 1953 నుంచి 57 వరకు నెలకు 500 రూపాయల వేతనంపై ఎ.వి.యం వారికి పాటలు పాడింది. అంతకుముందే 'వద్దంటే డబ్బు' తదితర చిత్రాల్లో పాటలు పాడింది. తర్వాత్తర్వాత 'జెమిని', 'అన్నపూర్ణ' మొదలైన సంస్థల్లో కూడా పాటలు పాడటం ప్రారంభించింది. 'కన్నతల్లి' సినిమాలో ఎ.మ్. రాజాతో కలిసి, 'ఎందుకు పిలిచావు' అనే పాట పాడింది. తర్వాత ఘంటసాల గారితో దాదాపు ప్రధానమైన సినిమాలన్నింటిలో నేపథ్య గాయనిగా సుశీల పాడటంతో ఆమె పేరు గగనమంటింది. ఘంటసాలతో కలిసి కొన్నివందల పాటలు పాడటం నిజానికి సుశీల అదృష్టంగా భావించాలి. వీటన్నింటికీ కారణం ఉగ్గుపాలతో, కన్నతల్లి సంగీత శిక్షణనివ్వటం ప్రధానమైన అంశంగా ఆమె భావించారు. హిందీ, బెంగాలీ , ఒరియా, సంస్కృతం, తుళు, సింహళ భాషల్లో కూడా ఆమె పాటలు పాడారు. ఒకప్పుడు జిక్కి, లీల, ఎం.ఎల్.వసంతకుమారి లాంటి గాయనీమణులు పాటలు పాడిన ఒరవడిలో సుశీల వచ్చి, కొన్ని వేల పాటలు పాడటం ఆంధ్రదేశం పొందిన వరంగా భావించవచ్చు. తీయదనం, మృదుత్వం, లాలిత్యం కలబోస్తే వచ్చే రూపాన్నే సుశీలగా భావించవచ్చు. సుశీల పాటల మాధుర్యానికి చిన్నపిల్లలైనా గంతులేయాల్సిందే. 'ఆకులో ఆకునై' పాటకానీ, 'నిన్నటిదాకా శిలనైనా' పాటకానీ, 'పాడవోయి భారతీయుడా', 'గాంధి పుట్టిన దేశం'కానీ,'స్వాతిముత్యంలో 'లాలి' పాటలతో పాటు, 'గోదారి గట్టుంది', మొక్కజొన్న తోటలో' ఇలా చెప్పుకుంటూ పోతే అంతుండదు. హిందీలో కిషోర్ కుమార్‌తో కలిసి పాడటం ఒక అరుదైన విషయం. లెక్కకు మించిన పాటలు పాడి అమృతం వర్షించిన సుశీల గొంతు ఈనాటికీ మొక్కవోని విధంగా ఉందంటే అది తెలుగువారి అదృష్టమే!

సుశీల పాటల మాధుర్యానికి చిన్నపిల్లలైనా గంతులేయాల్సిందే. 'ఆకులో ఆకునై' పాటకానీ, 'నిన్నటిదాకా శిలనైనా' పాటకానీ, 'పాడవోయి భారతీయుడా', 'గాంధిపుట్టిన దేశం'కానీ,'స్వాతిముత్యంలో 'లాలి' పాటలతో పాటు, 'గోదారి గట్టుంది', మొక్కజొన్న తోటలో' ఇలా చెప్పుకుంటూ పోతే అంతుండదు. హిందీలో కిషోర్ కుమార్‌తో కలిసి పాడటం ఒక అరుదైన విషయం. లెక్కకు మించిన పాటలు పాడి అమృతం వర్షించిన సుశీల గొంతు ఈనాటికీ మొక్కవోని విధంగా ఉందంటే అది తెలుగువారి అదృష్టమే!

చివర్లో ఒకమాట! సుశీల నిగర్వి. వినయ సంపన్నురాలు. పేరుప్రఖ్యాతులు ఆమె వ్యక్తిత్వానికి మరింత వన్నె తెచ్చాయి. కన్యాశుల్కంలో శ్రీశ్రీ గేయాన్ని ఆనందం అంబరమైతే అనురాగపు అంచులు చూస్తాం, 'ఆనందపు లోతులు చూస్తా' అనే పాటను ఎవ్వరూ మరువలేరు. సినిమా పరిశ్రమ ఉన్నంత వరకు సుశీల ఉంటుంది. అదే ఆమె ఘనత.

## ముసుగు తీయాల్సిందే

ఆదిమ యుగం మొదలుకొని...
ఆధునిక నాగరికతా శిఖరపు కొనల వరకు
అరణ్య కాలపు అరాచకాల నుండి
జనారణ్యపు వికృతకేళి వరకు
వేటగొమ్మగా... ఆటబొమ్మగా
అంగడి సరుకుగా ముదితను మలచిన
ఆ మృగాడి ముసుగు తీయాల్సిందే
పడతిమానం పగబట్టిన కాలనాగుల వశమైనప్పుడు
పరిణితినొందని పశునైజం పులుముకొన్న పురుషాధముడు
స్త్రీఔన్నత్యాన్ని రచ్చకీడ్చి రభస చేసినపుడు
అన్యాయమెపోయి అతివపేరుకి ప్రతిగా
'నిర్భయ'...'అభయ' అంటూ మార్పు పేర్లతో
ఏమార్చడానికి
అతివ ఆత్మాభిమానం...
ముందస్తు హెచ్చరిక చేసే తుఫాన్ కాదు
అసహనం అరుణిమ దాల్చే త్సునామీ కావొచ్చు...!
మగువ మనుగడను కాలరాసిన ఆ మధాంధుల
ముఖాలకు ముసుగులేసి... చట్టాలకు శిలువేయొద్దు
ముప్పిరిగొన్న ముష్కర గుణానికి ముసుగుతీసి
ముచ్చెమటలు పట్టించాల్సిందే...!

– ఇల్ల. ప్రసన్నలక్ష్మి



## ఆచార్య కొలకలూరి ఇనాక్

# స్త్రీ పాత్రలు - వ్యక్తిత్వం

- ఆచార్య కొలకలూరి మధుజ్యోతి

**(గత సంచిక తరువాత...)**

**3.'రమనాకూతురు'** (కొలుపులు, 2006) కథలో రమ తల్లి డెబ్బై ఏళ్ళ రసరాజ్యం. రసరాజ్యం సంపన్న మాదిగ స్త్రీ. ఆమె రంగారావుని ఇష్టపడింది. రసరాజ్యం, రంగారావు చిన్నప్పటి నుంచి కలిసి చదువుకొన్నారు. స్కూల్ ఫైనల్‌కు వచ్చేసరికి ప్రేమగా మారి ఆమెను శృంగార రసాధిదేవతగా అతను పిలిచేటంతగా అది ఎదిగింది. రాజుల కుటుంబపువాడైన రంగారావుకు, రసరాజ్యంతో స్నేహం ప్రేమగా పెళ్ళిగా పరిణమించే ప్రమాదాన్ని పసిగట్టిన అతడి తండ్రి కట్టడి చేస్తే అతనూ ఆ అభిజాత్యం వెనుక దాక్కోసాగాడు. అతను దూరంగా పోయే కొద్దీ ఆమె దగ్గర కావటానికి ప్రయత్నించేది. స్కూలు ఫైనలు తప్పి ఆమె విశాఖలో ఆగిపోవలసి వస్తే, అతను పై చదువులకు మద్రాసు వెళ్ళాడు. 'ఇల్లు కదలక, జ్ఞాపకాలు ముసురులో తడిసి ముద్ద ముద్దై అన్నం నీళ్ళు ముట్టక, చిక్కి సగమై వెర్రిచూపులు మాటలు చేష్టలు ఎక్కువై పిచ్చిదానిలా మారి పోయింది' (పు.133 కొలుపులు). అతను వస్తే కలిసే వీలులేక తానే మద్రాసు వెళ్ళాలని తీర్మానించుకొంది. అతడు మద్రాసు వెళ్తుంటే, కలసి మాట్లాడి, మనువాడాలని ఆమె కోరిక. రైలు ఎక్కింది ఒంటి నిండా నగలున్న ఆమెకు మద్రాసులో కాలేజీల చుట్టూ ఎంత తిరిగినా అతని ఆచూకి దొరకలేదు. తలదాచుకొనే చోటులేదు. ఎవరో ఆశ చూపారు. దోచుకో గలిగినవన్నీ దోచుకొన్నారు. ఆ ఎవరో ఎవరికీ తెలిదు. మద్రాసు సెంట్రల్లో బిచ్చమెత్తుకొంటున్న నిండు నెలలు పిచ్చిదాన్ని తల్లి దండ్రులు వెతుకుతూ వెళ్ళి గుర్తించి తెచ్చుకొన్నారు.' రంగా మనం పెళ్ళి చేసుకొందాం, నా సర్వస్వం నీవే అని కలవరించేది. బిడ్డ పుట్టాక పిచ్చి చూపులు మాటలు చేష్టలు తగ్గాయి. కానీ ఎప్పుడూ ఒకే మాట రంగారావు నా భర్త అని. బిడ్డ తండ్రి విషయమై కేసు అయి కోర్టు డిఎన్ఏ చేసి రంగారావు బిడ్డ కాదని తేలినా, ఆమె అప్పటికి ఇప్పటికీ ఎప్పటికీ నా భర్తే అని ఘంటా పథంగా చెప్పేది.

ఈ కథలో రంగారావు, రసరాజ్యం కౌమారదశలో స్నేహంలో ఆకర్షణలో ప్రేమలో పునీతమయ్యారు. రంగారావు లోకరీతిని గుర్తించి ఆమెతో స్నేహం ప్రేమలకు దూరమయ్యాడు. కానీ రాజ్యం అతనే లోకంగా అయ్యింది. అతని కోసం సాహసం చేసింది. మద్రాసు వెళ్ళింది. అతని కోసమే అవతలివారికి ఎర అయ్యింది. దోపిడికి గురి అయింది. అప్పుడైనా ఆమె రంగారావునే కలవరించింది. కనపడని కలవని రంగారావే తన బిడ్డకు తండ్రి అని ఆమె నమ్మింది. అదే బిడ్డకు చెప్పింది. కోర్టు కాదన్నా , విజ్ఞాన శాస్త్రం కాదన్నా ఆమె రంగారావే తన భర్త అని చెప్పింది. అతనితోడిదే జీవితంగా రసరాజ్యం స్కూలు వయసులోనే నిర్ణయించుకొంది. అతడి పట్ల ఆమెది మొక్కవోని ప్రేమ. ఆ ప్రేమ లౌకిక పరిధిని దాటిపోయింది. తనపై దోపిడికి కారణమెవ్వరో కూడా తెలియదు కాని, తన సర్వస్వంగా త్రికరణశుద్ధిగా రంగారావునే భర్త అని విశ్వసించింది. బిడ్డ పుట్టి భర్త లేకుండా జీవించిన రసరాజ్యం ఉన్న ఊళ్ళోనే, భార్యా బిడ్డలతో రంగారావు సుఖంగా ఉన్నాడు. ఆమెలో అతడి పట్ల నెలకొన్న భావనలో మార్పు లేదు. ఆమెకు పుట్టిన బిడ్డకు తనకు ఎలాంటి సంబంధం లేదని వాదించిన రంగారావు, ఆమెలో ప్రేమైక జీవిని చూశాక చివరిలో ఆమె దగ్గరకు వచ్చి 'నన్ను క్షమించు' అని అడిగాడు.

స్త్రీ ప్రేమైక జీవి. పురుషుడు అవకాశవాది. ఎన్ని ఎదురుదెబ్బలు తిన్నా స్త్రీ ప్రేమ చెక్కు చెదరలేదు. పురుషుడు చిన్న అవాంతరాలకే ఎలా మారిపోతాడో ఈ కథ చెప్తుంది. స్త్రీకి ఉండే ధైర్యం ఇక్కడ పురుషుడిలో లేదు. రసరాజ్యం ప్రేమా వరణంలో పునీతమయిన పుణ్యమూర్తి.

'రమ నా కుతురు' లో ఓ కోణం చర్చింపబడింది. అది ప్రేమౌన్నత్యాన్ని చూపిన కోణం. ఈ కథలో ఉన్న మరో అంశం న్యాయ సంబంధం. దళిత మాదిగ సంపన్న స్త్రీ అయిన రసరాజ్యం కూతురు రమ. రంగారావు తండ్రి అని తల్లి చెప్పింది. రసరాజ్యం రంగారావు ప్రేమించుకొన్నారు. అతడిని వెతుకుతూ మద్రాసు వెళ్ళి అత్యాచారానికి గురయ్యింది రసరాజ్యం. అతడినే కలవరిస్తూ పిచ్చిదానిలా ఉన్న రసరాజ్యాన్ని ఇంటికి తెచ్చారు. ఆమెకు రంగారావే భర్త. మరో మాట లేదు. కాని రంగారావు ఆమె ప్రేమ నుంచి బయటపడి పెళ్ళి చేసుకొని సుఖంగా ఉన్నాడు.

రసరాజ్యం కూతురు రమ. రమ మాదిగస్త్రీగానే పెరిగింది. డబ్బుండటం వలన రమ ఎక్కడా స్కాలర్‌షిప్పులు పొందలేదు. తెలివైనది కావటాన రిజర్వేషన్‌తో పని లేకుండా ఉద్యోగం వచ్చింది. యూనివర్శిటిలో లా ప్రొఫెసర్. ఆమె ఇద్దరు కొడుకులు, కూతురు దేశ విదేశాలలో సుఖంగా ఉన్నారు. ఆమె భర్త పేరు మోసిన క్రిమినల్ లాయర్. ఆమె పేరు ప్రఖ్యాతులు చూసిన రాజకీయ పార్టీ ఒత్తిడిపై ఎస్‌సి రిజర్వ్‌డు నియోజకవర్గంలో ఎం పి గా భారీ మెజారిటితో గెలిచింది. ఓడిన అభ్యర్థి ఆమె ఎస్‌సి కాదని కోర్టులో కేసు వేశాడు. హైకోర్టు ఆ కేసు కొట్టేసింది. అతను సుప్రీం కోర్టుకెళ్ళాడు. రమ ఐదేళ్ళు గడచి మళ్ళీ గెలిచి లా మినిష్టరు అయ్యింది. ప్రత్యర్థి కేసు వేశాడు. తండ్రి కులమే కూతురిది అవుతుందని తల్లి కులం కాదని కోర్టు ఆమె ఎన్నిక చెల్లదని పేర్కొంది. రమ లా మినిష్టరుగా రాజీనామా చేసి ఫుల్‌బెంచికి అప్పీలు చేసింది. రసరాజ్యం తన తల్లి అని, తన తల్లి కులమే తనది అని రమ వాదన. రసరాజ్యంతో శారీరక మానసిక సంబంధం ఏ రకంగానూ లేని రంగారావు యాభై ఏళ్ళ తర్వాత ఇలాంటి అపప్రధ ఏర్పడటంతో చింతించి కోర్టునాశ్రయించాడు. అతడు క్షత్రియుడు. డిఎన్‌ఏ టెస్టు రమ రంగారావు కూతురు కాదనే చెప్పాయి. కాని రమకు తల్లి వాస్తవం తండ్రి విశ్వాసం. తండ్రి ఎవరైనా తనకు సంబంధం లేదు. తల్లి ఎవరిని చెబితే అతడే తన తండ్రి అని వాదించింది. ఆమె భర్తగా రంగారావు పేరు చెప్పింది. అదే రమ విశ్వసించింది. కని పెంచిన తల్లి కంటే పెంచని బాధ్యత తీసుకోని వ్యక్తిని తండ్రిగా పేర్కోవటం అర్థరహితం అంది. తండ్రి తెలియాల్సిన అవసరం ఏమిటి? అని ప్రశ్నించింది. తీర్పులు ఇవ్వటం కాదు కాలానుగుణంగా మారాలని వాదించింది.

'మాతృస్వామిక వ్యవస్థలో ఏ పురుషుడికి ఏ బిడ్డ సంతానమో ఎవరు చెప్పగలరు' (పు136) అని ప్రశ్నించింది. 'కళ్ళు కానని అంధయుగంలో దిక్కుమాలిన పెళ్ళి పేరంటంలేని సన్నాసులు బీజ ప్రాధాన్యం చెప్పినంత మాత్రన క్షేత్ర ప్రాధాన్యం గాలికి కొట్టుకు పోతుందా? .... సమాజం మారిందని గుర్తించని మీరు, ఒక నాడెప్పుడో ఎవరికో ఎందుకో ఉద్దేశించిన తండ్రి ముఖ్యమనే ముక్క నేడు పట్టుకొని వేలాడబడుతున్నారే మీకేమయినా సాంఘిక న్యాయం తెలుసా? మానవ ప్రాధాన్యం తెలుసా? సమాజస్థితిగతి అర్థమవుతున్నాయా?' (పు 137) అని తీవ్రంగా ప్రశ్నించింది, న్యాయాన్ని న్యాయస్థానాన్ని నిలదీసింది రమ.

శతాబ్దాల క్రితపు ధర్మ సూత్రాన్ని మార్చుకోవలసిన అవసరాన్ని నొక్కి చెప్పింది. మారే కాలానికి మారే అవసరానికి చట్టాలూ తగినవి ఉండాలని చాటింది. 'ప్రస్తుత చట్టం ,శాసనం మారాలి. న్యాయస్థానం మార్పును ప్రతిపాదించాలి. దేశం దాన్ని శాసనం చేయాలి. అది అమలు కావాలి' (పు140) అంది. ఇందరు మేధావులు ఆలోచనా వరులు న్యాయవాదులు కలిసి తగిన ధర్మ సూత్రాలు ప్రతిపాదించలేకపోతే న్యాయ వ్యవస్థలు దుర్గతి పట్టినట్టే అని హెచ్చరించింది. రాజ్యాంగం పొందవలసిన మార్పును స్పష్టం చేసింది. ఈ కథ తల్లి కులమే బిడ్డ కులం కావాలనే భావనను చాటింది. రాజ్యాంగంలో జరగవలసిన మార్పు ప్రగాఢంగా ప్రకటించింది. అన్నింటి కంటే విశేషం రచయిత దూరదృష్టి. రాజ్యాంగంలో చోటు చేసుకోవలసిన మార్పును గుర్తింప చేసే స్థితి కలగటం. స్త్రీకి గుర్తింపు ఉండాలని రాసిన కథ 'రమ నా కూతురు'.

రమ చేత ఇంత నూతన ప్రతిపాదనలు చేయించిన రచయితది ముందు చూపు. 2006లో ఈ సంకలనం వెలువడితే తత్పూర్వం రెండేళ్ళ క్రితం ఈ కథ పత్రికలో అచ్చు అయ్యింది (రచయిత మాట). అంటే 2004లో వచ్చింది ఈ కథ. స్త్రీల పట్ల అనుకంప స్త్రీల గురించి ఆలోచించేలా చేసింది. తల్లి కులమే బిడ్డల కులం కావాలనే బలమైన ప్రతిపాదన ఈ కథలో బలంగా ఉంది. అందు వల్లే స్త్రీ వాదులు ఎంతగానో ఈ కథను మెచ్చారు. 'కొలుపులు'కు 'హృదయం' రాస్తూ రచయిత మారుతున్న సామాజిక వాతావరణం గుర్తించి రావలసిన మార్పులను నొక్కి చెప్పారు. నేడు సర్టిఫికెట్లలో తల్లి పేరు తప్పనిసరి కావడం, ఆర్థిక లావాదేవీలలో తల్లి పేరు తప్పని సరి కావడం వంటివి గమనిస్తే రచయిత ప్రతిపాదించిన ఈ మార్పు మెల్లగా సమాజం గుర్తిస్తూ ,ఆచరిస్తూ ఉండడం గమనించగలం.

**ముగింపు**: ఈ మూడు కథలు భిన్న కాలాలవి. కాలం ఏదైనా స్త్రీ స్వయం

> ఈ కథలో ఉన్న మరో అంశం న్యాయ సంబంధం. దళిత మాదిగ సంపన్న స్త్రీ అయిన రసరాజ్యం కూతురు రమ. రంగారావు తండ్రి అని తల్లి చెప్పింది. రసరాజ్యం రంగారావు ప్రేమించుకొన్నారు. అతడిని వెతుకుతూ మద్రాసు వెళ్ళి అత్యాచారానికి గురయ్యింది రసరాజ్యం. అతడినే కలవరిస్తూ పిచ్చిదానిలా ఉన్న రసరాజ్యాన్ని ఇంటికి తెచ్చారు. ఆమెకు రంగారావే భర్త. మరో మాట లేదు. కాని రంగారావు ఆమె ప్రేమ నుంచి బయటపడి పెళ్ళి చేసుకొని సుఖంగా ఉన్నాడు. రసరాజ్యం కూతురు రమ. రమ మాదిగస్త్రీగానే పెరిగింది. డబ్బుండటం వలన రమ ఎక్కడా స్కాలర్‌షిప్పులు పొందలేదు. తెలివైనది కావటాన రిజర్వేషన్‌తో పని లేకుండా ఉద్యోగం వచ్చింది.

సంపూర్ణంగా ఉండాలన్నది రచయిత కోరిక. దృఢమైన వ్యక్తిత్వంగల స్త్రీగా, స్వయం నిర్ణయాధికారంగల స్త్రీగా, చదువుకొని ఎదిగి శాసనాధికారం, పాలనాధికారం గల రాజకీయ శక్తిగా స్త్రీలను ఈ మూడు కథలు చూపాయి.

స్త్రీ వాదం రాకపూర్వం, వచ్చినా బాగా ప్రాచుర్యంలోకి విస్తరించక పూర్వం, ఆ తర్వాత వచ్చినవి ఈ కథలు. 1962 (1967), 1999, 2006, కాలాల లో వచ్చిన ఈ కథలు, రచయిత స్త్రీలపట్ల దృష్టి కోణాన్ని చూపాయి. కాలంతో వాదాలతో సంబంధం లేనిది ఈ దృష్టికోణం. స్త్రీ చదువుకోవాలి ఎదగాలి పాలనలో భాగస్వామి కావాలి. ఈ కోరిక ప్రస్ఫుటంగా వీరి రచనల్లో ఉంటుంది. స్త్రీని న్యూనంగానో నీచంగానో కాక ఉదాత్తంగానో ఉన్నతంగానో మాత్రమే వీరి రచనల్లో చూడగలం. స్త్రీ పట్ల రచయిత భావనలో ఉన్న ఉన్నతత్వానికి పరిణామ క్రమంలో ఎటువంటి విఘాతమూ కలగకపోగా అది మరింత ఉజ్జ్వలంగా కనిపించింది. ఇది పైపై భావన కాక రచయిత గాఢమైన ఆలోచనా స్రవంతిలో భాగంగా డెబ్బై ఏళ్ళ సాహిత్య రచనా కాలంలో స్పష్టంగా కులం కావా లనే బలమైన ప్రతిపాదన ఈ కథలో బలంగా ఉంది. అందు వల్లే స్త్రీ వాదులు ఎంతగానో ఈ కథను మెచ్చారు. 'కొలుపులు'కు 'హృదయం' రాస్తూ రచయిత మారుతున్న సామాజిక వాతావరణం గుర్తించి రావలసిన మార్పులను నొక్కి చెప్పారు. నేడు సర్టిఫికెట్లలో తల్లి పేరు తప్పనిసరి కావడం, ఆర్థిక లావాదేవీలలో తల్లి పేరు తప్పని సరి కావడం వంటివి గమనిస్తే రచయిత ప్రతిపాదించిన ఈ మార్పు మెల్లగా సమాజం గుర్తిస్తూ, ఆచరిస్తూ ఉండడం గమనించగలం.

**ముగింపు**: ఈ మూడు కథలు భిన్న కాలాలవి. కాలం ఏదైనా స్త్రీ స్వయం సంపూర్ణంగా ఉండాలన్నది రచయిత కోరిక. దృఢమైన వ్యక్తిత్వంగల స్త్రీగా, స్వయం నిర్ణయాధికారంగల స్త్రీగా, చదువుకొని ఎదిగి శాసనాధికారం, పాలనాధికారం గల రాజకీయ శక్తిగా స్త్రీలను ఈ మూడు కథలు చూపాయి. స్త్రీ వాదం రాకపూర్వం, వచ్చినా బాగా ప్రాచుర్యంలోకి విస్తరించక పూర్వం, ఆ తర్వాత వచ్చినవి ఈ కథలు. 1962(1967), 1999, 2006, కాలాలలో వచ్చిన ఈ కథలు, రచయిత స్త్రీలపట్ల దృష్టి కోణాన్ని చూపాయి.

కాలంతో వాదాలతో సంబంధం లేనిది ఈ దృష్టికోణం. స్త్రీ చదువుకోవాలి ఎదగాలి పాలనలో భాగస్వామి కావాలి. ఈ కోరిక ప్రస్ఫుటంగా వీరి రచనల్లో ఉంటుంది. స్త్రీని న్యూనంగానో నీచంగానో కాక ఉదాత్తంగానో ఉన్నతంగానో మాత్రమే వీరి రచనల్లో చూడగలం. స్త్రీ పట్ల రచయిత భావనలో ఉన్న ఉన్నతత్వానికి పరిణామ క్రమంలో ఎటువంటి విఘాతమూ కలగకపోగా అది మరింత ఉజ్జ్వలంగా కనిపించింది. ఇది పైపై భావన కాక రచయిత గాఢమైన ఆలోచనా స్రవంతిలో భాగంగా డెబ్బై ఏళ్ళ సాహిత్య రచనా కాలంలో స్పష్టంగా.

**(రచయిత శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం ప్రొఫెసర్)**

# స్పందన

**ఎడిటర్ గారికి,**

1. మానవి ఏప్రిల్-జూన్ సంచికలో డా॥ప్రగతి గారు వ్రాసిన "విలువైన బహుమతి" కథ చాలి బాగుంది. పురుషులు ఇంటిపనులు చేయడాన్ని మహిళలే వ్యతిరేకించే తత్వాన్ని విడనాడాలనీ సమాజంలో మార్పు ఇంటినుండే ప్రారంభం కావాలనే సందేశాన్ని ఈకథ అందించింది. ఇలాంటి కథల ద్వారానైనా సమాజంలో ఆలోచనా విధానంలో కొంత మార్పు రావాలని ఆశిద్దాం.

**- కె. నాగలక్ష్మి, హైదరాబాద్**

2. గత సంచికలో పి.సుప్రజ గారు వ్రాసిన "ఇది కథకాదు" చాలా బాగుంది. మహిళలు తమ ఖాళీ సమయాల్లో ఎన్నో సామాజిక కార్యక్రమాలలో పాల్గొని సమాజికాభివృద్ధికి ఎంతో కొంత కృషి చేయవచ్చుననే సందేశాన్ని ఈ కథ ఇస్తుంది.

**- కృష్ణ సోదరి, పీర్‌లెస్ ఎంప్లాయి**

3. ఐద్వా నాయకురాలు జగ్మతీ సంగ్వాన్ హర్యానాలో అనేక వివక్షతలనెదిరించి ఏవిధరగా పనిచేశారో మహిళల హక్కుల కోసం ఎలా ఉద్యమించారో గత సంచికలో మత్తా శెమంతకమణిగారు వివరించడం చాలా ఉపయోగకరంగా వుంది. మహిళా నాయకురాళ్ళ జీవితాల గురించి రాబోయే సంచికలలో కూడా ప్రచురిస్తే మహిళలందరికీ స్ఫూర్తిదాయకంగా వుంటుంది.

**- ఎ.రాధారాణి, పీర్‌లెస్ ఎంప్లాయి**

- పి. సత్యవతి

కథ

# స్వర్ణ పెళ్ళి



ఎదురుగా నిలబడిన స్వర్ణని గుర్తు పట్టలేనంతగా కంటిచూపు మందగించిందా అని ఆశ్చర్యపోతూనే "అరె!నువ్వా?" అన్నాను. ఆ అమ్మాయి మాట్లాడలేదు తలవంచుకుని నిలబడింది. "కూర్చో స్వర్ణా" అంటే కూర్చోలేదు.

"ఏమైంది తల్లీ" అని భుజం మీద చెయ్యి వేశాను ఉలిక్కిపడింది.

జూనియర్ ఇంటర్లో డెభ్భై అయిదు శాతం మార్కులు తెచ్చుకుని నాకు సందు చివర హరియానా పొయ్యి దగ్గరి నుంచీ వేడి వేడి జిలేబీలు తెచ్చిపెట్టిన విషయం గుర్తు చేస్తూ "ఏం తెచ్చావు నాకు" అన్నాను.

"ఇదిగో ఇవ్వి" అని కళ్ళల్లో ఊరుతున్న నీళ్ళు చూపించింది. "అమ్మతో గొడవ పడ్డావా?" అంటే తల అడ్డంగా ఊపింది. .జిలేబీలు తెచ్చిన పదహారేళ్ళ స్వర్ణ కాదిది. ఏడాదికే పదేళ్ళు పెద్దదైంది.

"సరే వుండు టీ పెట్టుకొస్తా" అంటూ వంట గదిలోకి పోతూ వుంటే చెయ్యిపట్టి ఆపి " టీ వద్దు కూసోండి" అని నేలమీద చతికిల పడింది. తమ చుట్టాలందరిలోకి తను తెల్లగా వుంటానని, బాగుంటాననీ, కష్టపడి పని చేస్తాననీ, పిల్లల్ని చదివించు కుంటున్నాననీ ఎప్పుడూ చెప్పుకునే దుర్గ కూతురు స్వర్ణ. తల్లి పోలికే.

"అమ్మకి బాగా బిపి పెరిగింది మూడు రోజుల్నించీ లెగలేదు" అంది ముక్కు తుడుచుకుని.

"అందుకని చూడ్డానికొచ్చావా?"

"అక్కడ్నించీ వచ్చేసా".

మతిపోయింది నాకు. ఈ పిల్లను అక్కడికి పంపడానికి దుర్గ పడ్డ పాట్లు ఎన్నో!

అప్పుడు ఏడవడం మొదలుపెట్టి పదిహేను నిమిషాల తరువాత వెక్కిళ్ళు ఆపుకుని మొహం కడుక్కొచ్చింది.

ఏడాది క్రింద ఈ రోజుల్లోనే నా కంప్యూటర్లో జూనియర్ ఇంటర్ రిజల్ట్స్ చూసుకుని పరిగెత్తుకు పోయి జిలేబీ తెచ్చిన పిల్ల ఏమంది నాతో? ఇంటర్ పూర్తి చేసుకుని ఇంకా చదువుకుని ఉద్యోగం చేసుకుని.. అంటూ మేఘాల్లో తేలిపోయింది.

నాలుక మీద తీపి రుచి పోకముందే దుర్గ సంతోషంగా వచ్చి "దీనికి మంచి సమ్మందం వచ్చిందమ్మా. ఆల్లు బాగా ఉన్నోళ్ళు. ఇల్లుంది. పిల్లాడి నాన్నకి గవర్మేట్లో ఉద్యోగం. ఆయన రిటైరైనాక ఈ పిల్లాడికే వస్తాదంట. లక్ష కట్నం అడుగుతున్నారు" అంది ఆయాసపడుతూ.

"అదేంటి? దీనికి పదహారు మొన్ననేగా వెళ్ళాయి? ఇంటర్ కానీ పద్దెనిమిదొస్తాయ్."

"మంచి సమ్మందం కలిసొచ్చినప్పుడే సెయ్యాలి. ఆల్లకి పిల్ల నచ్చింది. దీని పెళ్ళి అయితే నేను ఒడ్డున పడతాను"

"అది చదువుకుంటున్నది కదా! ఇంటర్ అయిపోనీ తెలివి కలది మంచిగా పాసయింది".

నాతో వాదించడం అనవసరం అనుకుంది కాబోలు ఇంక ఆ ప్రసక్తి వదిలిపెట్టింది. నేను వదిలిపెట్టకుండా తుగులుకుని అప్పుడే పెళ్లి చెయ్యడంలోని కష్టాలన్నీ చెప్పాను. దుర్గ తన సాధక బాధకాలు చెప్పింది. స్వర్ణకి ఇప్పుడు పెళ్లి చేసి పంపడం ఎంత అవసరమో చెప్పింది. ఆమె చెప్పినంతవసరం లేదని తెలిసి కూడా నేనేమీ చెయ్యలేకపోయాను.

"ఏం చదివాడు పెళ్ళికొడుకు?" అంటే పది చదువుతూ మానేసాడంది" ఈ పిల్లే చెప్పిన మాట వినకుండా కాలేజీలో అనవసరంగా చేరిందన్నది. పదికూడా పాస్ కాని వాడికి ఉద్యోగం వస్తుందంటే వాళ్ళ నాన్న చేసే డ్రయివర్ ఉద్యోగం ఇతనికి ఖాయం అంది. ఎట్లా ఖాయమో నాకు అర్థం కాలేదు. దుర్గ తలుచుకున్న పని చేసి తీరుతుంది ఎవరూ ఆమెని ఆపలేరని నాకు తెలుసు... ఆ పైన పెళ్ళి మాటలు ఏం జరిగాయో నాకు చెప్పడం మానేసింది. ఐదువేలు అప్పు చేసి నిశ్చితార్థం చేసింది. అది అంత అవసరమా అంటే "నీకు తెలీదులే" అంది... నిశ్చితార్థం తరువాత స్వర్ణని కాలేజి మాన్పించారు అత్తవారు. ఇంటర్ అయినా పూర్తికానిమ్మంటే వద్దనేసారు.

దుర్గ మొగుడు పెయింట్ పనులు చేస్తాడు. అతనికి నెలజీతం అంటూ వుండదు. పనులొచ్చినప్పుడే డబ్బులొస్తాయి. అతనికి తాగుడు అలవాటుంది. దుర్గ ఇళ్ళల్లో పన్లు చేసి నెలకి ఎనిమిది వేలు సంపాయిస్తుంది. చీటీలు, డ్వాక్రాలూ కడుతూ హడావుడిగా వుంటుంది.

దుర్గ కూతురు పెళ్ళి అయింది. కూతురు పెళ్ళి అయినాక దుర్గలో చురుకుతనం తగ్గినట్లే అనిపించింది. పిల్లను కాపురానికి పంపించింది. ఏడాది తరువాత ఇదిగో మళ్ళీ ఇప్పుడొచ్చింది స్వర్ణ. బీపీ తో మంచాన వున్న తల్లిని చూడడానికి కాక అక్కడినించే వచ్చేసానని చెప్పటానికి!

"పొద్దునొకాయన వచ్చాడండీ అమ్మని బూతులు తిట్టి పోయాడు. నాన్నని కూడా తిట్టాడు. మళ్ళీ నాన్న కూడా అమ్మనే తిట్టాడు. అమ్మ ఏడుస్తూ పడిపోయింది.

ఆయనెవరో నేను అడగక్కరలేదు. యాభై వేలు మీద వడ్డీ వసూలుకు వచ్చి నాయన అయి వుంటాడు.

"వాళ్ళు అమ్మాయికి కుక్కర్‌తో సహా వంట సామానంతా అడిగారు. పాతికవేలైనయ్"

స్వర్ణకి పది చీరెలు కొన్నాను. అరడజను చుడీలు కొన్నాను. లంగాలు జాకెట్లు, కాలిపట్టీలు, దిద్దులు అల్లుడికి ఉంగరం ఎనభై వేలు నగదు"

మావాళ్ళంతా కలిసి మంచాలు కొనిచ్చారు. వాటి మీదకి పరుపులు దిళ్ళు దుప్పట్లు".

"అత్తా మామ, మరుదులు, ఆడబడు చులకి బట్టలు, మావాళ్ళకి బట్టలు, పెళ్ళి భోజనానికి సరుకులు, వంటవాళ్ళు"...

"పెళ్ళి వున్నంతలో బాగా చేశా.. రేపు నాకొడుక్కి ఇవన్నీ రాబట్టనా ఏంది?

మానాన్న మావూళ్ళో నాకిచ్చిన వంద గజాల స్థలం తాకట్టు పెట్టా... పిల్లకన్నా ఎక్కువా? ఒక చీటీ పాడేసా ముందే.. డ్వాక్రా లోను తీసా. ఒకాయన కాడ యాభై వేలు పదిరూపాయల వడ్డీకి తెచ్చా.

"నీ జీతంలో ఈ అప్పులన్నీ ఎట్లా తీరుద్దామని చేసావు దుర్గా? ఇంత ఆడంబరం అవసరమా?

"ఈ మాత్రం చెయ్యకపోతే మా వాళ్ళంతా నవ్వుతారమ్మా. మావూళ్ళో ఎంత ఘనంగా జరుగుతున్నాయి పెళ్ళిళ్ళు. వాటి ముందు ఇదొక లెక్కా? ఒక్క కూతురు నాకు. అక్కడ దాన్ని బాగా చూసుకోవాలంటే

**పులిని చూసి నక్కవాత లాగా!! పులి ఆడంబరాలకోసం అప్పులు చేసి ఎగ్గొట్టగల స్థోమత గలది ఎంత డబ్బైనా మింగి త్రేంచగలది. నక్కకి వాతలు పెట్టుకుని అప్పుల్లో కూరుకుపోయి బూతులు పడడము, ఉన్నదంతా ఊడ్చి పెట్టుకోవడమే మిగిలింది.**

చెయ్యాలి తప్పదు. రెండేళ్లాగితే నా కొడుక్కి ఉద్యోగం వస్తుంది. అప్పటికి కుదుటపడనా? ఆడపిల్లని కాపాడుకోవడం ఎంత కష్టం? ఆళ్ళ నాన్న ఇంట్లో వుండడు. పనికి పోతాడు. నేను పనికి పోతాను. నాకొడుకు వుండడు. ఇంట్లో ఒక్కత్తే వుంటది. రోజులేం బాగున్నయ్యమ్మా? చూస్తూనే వున్నావ్ కదా? కాలేజికి పంపితే దీని వెనక పోకిరీ కుర్రాళు ౢ. నాకేమో వేలకి వేలు కట్టి పెద్ద పెద్ద కాలేజీల్లో సదివించే శక్తి లేదాయే. పెళ్ళి చేసి పంపిస్తే నా దిగులు తీరిపోయింది.. ఈ దుర్గకి చెప్పడం నా తరమా? దుర్గ సంతోషంగా నాకు లడ్లు తెచ్చి ఇచ్చింది. వెగటుగా అనిపించాయి.

ఎన్నిచ్చినా స్వర్ణకి ఆరళ్ళు తప్పలేదు. ఇంకా ఏవో తేవాలి. ఇంట్లో పని చెయ్యాలి.

"నువ్వు వచ్చేస్తే వాళ్ళు వూరుకున్నారా."

"వాళ్ళ సొమ్మేం పోయింది? మళ్ళీ అమ్మే తీసుకొచ్చి దించుతుందని ధీమా!"

బయట బ్యాండ్ మేళం హూరు. అలవాటు చొప్పున స్వర్ణ గేట్ దగ్గరకు పరిగెత్తుకు పోయింది.

"అమ్మా ఇట్రండి తొందరగా! మహా భారతం వస్తోంది" అని అరిచింది.

నవ్వొచ్చింది మహాభారతం టీవీ సీరియల్లో రథాన్ని చూడ్డం వలన దాన్ని మహాభారతం అంటుంది స్వర్ణ. మా వీధి చివరి ఇంట్లో పెళ్ళికొడుకు రథం మీద పెళ్ళి మంటపానికి వెడుతున్నాడు. రథానికి రెండు తెల్ల గుర్రాలు వాటిని నడిపిస్తూ ఇద్దరు మహారాజా సేవకులు, చెవులు చిల్లులు పడే బ్యాండ్ వాద్యం. రథం ముందు పది పదిహేను కార్లు.

మనూళ్ళో జరిగే పెళ్ళిళ్ళు అని దుర్గ చెప్పేది ఇవే. పులిని చూసి నక్కవాత లాగా!! పులి ఆడంబరాలకోసం అప్పులు చేసి ఎగ్గొట్టగల స్థోమత గలది ఎంత డబ్బైనా మింగి త్రేంచగలది. నక్కకి వాతలు పెట్టుకుని అప్పుల్లో కూరుకుపోయి బూతులు పడడము, ఉన్నదంతా ఊడ్చి పెట్టుకోవడమే మిగిలింది.

"అమ్మని ఆసుపత్రికి తీసుకెళ్ళాలి. డబ్బుల్లేవు మీ కాడ ఒక అయిదొందలు అడిగి తెమ్మంది..."

"నువ్వేం చెయ్యదలుచుకున్నావు?"

"మా ఆయన్ని కూడా ఇక్కడికే రమ్మంటాను.. ఇద్దరం పని చేసుకుంటాం. లేదంటే నేను ఇక్కడే వుండిపోయి పెళ్ళి అప్పు తీరే దాకా ఏదో ఒక పని చేస్తా! ఇంక ఎవరి మాటా వినేది లేదు. అమ్మ మాట అసలు వినను. నా మూలంగా అమ్మ ఎన్ని చెడ్డ తిట్లు తిన్నదో పొద్దున ! "ఛీ ఛీ! ఆయన్ని బాగా కొడదామనిపించింది. ఏమైతే కానీ ఈసారి మాయింటికొచ్చి తిడితే మాతరం కొట్టేది కొట్టేదే! సర్లే అమ్మా! తొందరగా డబ్బులిచ్చేయ్ అమ్మని ఆస్పత్రికి తీసుకుపోతా"

పదేళ్ళు ముందుకు పోయిన స్వర్ణ మళ్ళీ వెనక్కొచ్చే సూచన కనిపించింది.

వ్యాసం

# ప్రాణాంతకమైన కల్తీసారా

- నండూరి పద్మాంజలి

దుర్గకు 35 సం॥ లు, ముగ్గురు ఆడపిల్లలు, ఒక కొడుకు. భార్య, భర్తలిద్దరూ కూలీ పనులు చేసుకుంటారు. భర్త లిక్కరుకు అలవాటుపడి ఆరోగ్యం పాడుచేసుకొని అర్థంతరంగా చనిపోయాడు. స్థానిక కౌన్సిలర్ ఆమెకు వితంతు పెన్షన్ శాంక్షన్ చేయించాడు. ఆమె పిల్లల్ని పోషించుకోవడానికి పడుతున్న అవస్థలు అన్నీ ఇన్నీ కావు. ఇంకో మహిళ రాజ్యలక్ష్మీ భర్త త్రాగొచ్చి కొడుతున్నాడని తట్టుకోలేక పెద్దలలో చెల్లుచీటీ ఇచ్చింది. మొగుడు నొదిలేసిన ఆడది అని ఆమె కూతుర్ని పెళ్ళిచేసుకోవడానికి చాలామంది ముందుకు రావడంలేదు. కూరగాయల లక్ష్మీ, రంగారావుకి 5గురు అమ్మాయిల మధ్య పుట్టిన ఒక్కగానొక్క కొడుకు 20 సం॥ల వేణు అక్రమా సారా తాగి అశువులు బాసాడు.

ఇలా వ్రాసుకుంటూ పోతే వేలు లక్షల సారా బాధితులు మనకు కనబడతారు. ప్రభుత్వం అధికారికంగా మందు అమ్మిస్తున్నది. దానికి ప్రధాన ఆదాయంగా వచ్చే వాణిజ్య పన్నుల తరువాత ఎక్సైజ్ మీద వచ్చే ఆదాయం రెండవ వనరుగా ఉన్నది. ఇప్పటికీ మన రాష్ట్రంలో 4,380 రిటైల్ వైన్ షాపులు, 31,029 పర్మిట్ రూమ్‌లు, 770 బార్‌లు ఉన్నాయి. దానిమీద ప్రభుత్వానికి ప్రస్తుతం 2014- 15 లో 12వేల కోట్లు, 15 -16లో 13వేల కోట్లు రూపాయలు గడిస్తున్నది. **ఇక్కడ 2016-17 లో 15000 కోట్ల** రూపాయలకు పెంచాలని నూతన ఎక్సైజ్ పాలసీ అమలుచేస్తున్నది. ఈ మద్యం వ్యాపారంపై ఆధారపడి అధికారికంగా 75 వేల మంది పనిచేస్తుండగా అనధికారికంగా రెండు లక్షల పై చిలుకు మంది పనిచేస్తున్నారు. లేనివాళ్ళు నాటుసారా మీద బ్రతుకుతుంటే, ఆదాయం ఉన్నవాళ్ళు లైసెన్సుడు మద్యం సేవిస్తున్నారు. ప్రభుత్వం ఆదాయం పెంచుకోవడానికి టార్గెట్లు పెడుతుంటే అతి తక్కువ ఖర్చుతో అదేసారా మనం తయారుచేసుకుని త్రాగవచ్చు అని కుహనా వ్యాపారులు, స్థానిక రాజకీయు, పోలీసు అధికారుల అండచూసుకొని నాటుసారా తయారు చేస్తున్నారు.

మద్యంలో ప్రధానంగా ఎథనాల్, మిథనాల్ అనే మత్తు పదార్థాలు ఉంటాయి. ఒక ఆపిల్ పండులో 0.2 - 0.3 శాతం వరకు ఇది ఉంటుంది. ఈ మద్యం తయారుచేసేటప్పుడు కొన్ని రసాయనాలు ఉత్పన్నమవుతాయి. లైసెన్స్‌డ్ లిక్కర్స్‌లో వాటిని డిస్టిలైజ్ చేస్తారు. కానీ, గ్రామీణ ప్రాంతాల్లో అటవీ భూముల ప్రాంతాల్లో కాటేజి పరిశ్రమలుగా వీటిని భావించి కాచేచోట వాళ్ళకి ఆధునికి పరికరాలు, సాంకేతిక విజ్ఞానం లేనందువలన వాటిని వారు తయారుచేసే మద్యం నుండి మిథనాల్, ఎథనాల్ లను వేరుచేయలేరు. పైగా ఎక్కువ మత్తు, శక్తి వస్తుందని, లీడ్, ఆర్సెనిక్, సల్ఫర్, అమోనియం క్లోరైడ్, బ్యాటరీ యాసిడ్‌లు కలుపుతారు. వీటిని కలపడం వలన అందులో పార్మిక్ యాసిడ్ ఉద్భవించి త్రాగినవాడి మీద అది మెల్లగా పనిచేయడం ప్రారంభించి మొదట బద్ధకం, కోపం, తలనొప్పి, కడుపులో మంటతో ప్రారంభించి తరువాత గుడ్డివాడిగా మారిపోయి చివరకు మరణం సంభవిస్తుంది. ఇదంతా జరగడానికి ఎంతోకాలం పట్టదు. ఈ అక్రమ తయారీ సారా త్రాగడం మొదలుపెట్టిన రెండు సంవత్సరాలలో ఇదంతా జరిగి పోతుంది. ఒక్కోసారి కల్తీసారా త్రాగడం వలన ఒక్క రోజులో మరణం సంభవించ వచ్చు. అలాంటి వార్తలు మనం పేపర్లలో అనేకం చూస్తూ ఉంటాము. ఐద్వా జగ్గయ్యపేట డివిజన్ కమిటీ సారా వ్యతిరేక పోరాటం చేసినపుడు వారు ప్రత్యక్షంగా సారా కాచే ప్రదేశాలను పర్యవేక్షించగా ఆ గోతుల్లో చనిపోయిన పాములు, తేళ్ళు, జెర్రులు, ఎలుకలు, బ్యాటరీలు పగులగొట్టనవి, గడ్డీ, చెత్త రకరకాలు పోసి సారా పులువబెడుతున్నారని గ్రహించారు. మన రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాలు ఆర్టికల్.47 లో ఆరోగ్యానికి హానిచేసే ఏ మత్తు పధార్ధము రసాయనిక పధార్ధము ఈ మత్తు పానీయాలలో కలపరాదని, కేవలం వైద్య సంబంధ పధార్థాలనే వాడాలని సూచిస్తుంది. కానీ,

**గ్రామీణ ప్రాంతాల్లో అటవీ భూముల ప్రాంతాల్లో కాటేజి పరిశ్రమలుగా వీటిని భావించి కాచేచోట వాళ్ళకి ఆధునికి పరికరాలు, సాంకేతిక విజ్ఞానం లేనందువలన వాటిని వారు తయారుచేసే మద్యం నుండి మిథనాల్, ఎథనాల్ లను వేరుచేయలేరు. పైగా ఎక్కువ మత్తు, శక్తి వస్తుందని, లీడ్, ఆర్సెనిక్, సల్ఫర్, అమోనియం క్లోరైడ్, బ్యాటరీ యాసిడ్‌లు కలుపుతారు. వీటిని కలపడం వలన అందులో పార్మిక్ యాసిడ్ ఉద్భవించి త్రాగినవాడి మీద అది మెల్లగా పనిచేయడం ప్రారంభించి మొదట బద్ధకం, కోపం, తలనొప్పి, కడుపులో మంటతో ప్రారంభించి తరువాత గుడ్డివాడిగా మారిపోయి చివరకు మరణం సంభవిస్తుంది. ఇదంతా జరగడానికి ఎంతోకాలం పట్టదు.**

ఆ నియమాలు కాగితాలకే పరిమితమైనవే తప్పు వాస్తవంలో ఎవరూ ఆచరించడం లేదు. మన దేశంలో 2/3 వంతుల మంది మద్యానికి అలువాటు పడ్డారు. కూలీ, నాలీ జనాలంతా త్రాగి రోడ్డున వడుతుంటే ఉన్నవాడు నాలుగు గోడల మధ్య త్రాగి ఇంట్లో నరకం చూపిస్తాడు. ఎంతోమంది కాపురాలు పాడుచేసుకుంటు న్నారు. చిన్న వయసులో మరణిస్తున్నారు. మత్తు కమ్మిన కళ్ళకు ఆడదాని మొహం కనిపించక అది ఆడది, అదిచాలు అని తల్లి, చెల్లిని కూడా చూడక అత్యా చారాలు చేసే స్థాయికి దిగజారు తున్నారు. ఎంతోమంది కాలేజీ యువకులు కూడా మద్యం బారినపడి ఆడపిల్లలను వేధిస్తున్నారు. ప్రభుత్వ మద్యం డిస్టిలైజేషన్ చేసింది కావడం వలన దీర్ఘకాలంలో ఆనారోగ్యం పాలవుతుండగా, పరిసర ప్రాంతాల్లో అక్రమంగా తయారుచేసే నాటుసారా వలన త్వరితగతిన మరణాలు సంభవిస్తున్నాయి. ప్రభుత్వ లైసెన్సు మందు షుమారు రూ. 50/- లు ఉండగా, అంతే పరిమాణంగల నాటుసారా రూ. 10/- లకే దొరుకుతుంది. ఎందుకంటే ఈ నాటుసారా కాచేవారు ప్రభుత్వ పన్నులు, షాపు అద్దెలు, త్రాగడానికి ఆధునిక వసతులు కల్పించనవసరం లేనందున కారుచౌకగా చీపు పధార్థాలతో కాచి, అక్రమంగా డబ్బు ఆర్జిస్తున్నారు. వీరంతా స్థానికంగా గూండాలు, రౌడీలుగా పేరు మోసినవారే అయి ఉంటున్నారు. రాజకీయ నాయకులు ఎన్నికల సమయంలో ఓటుకు నోటుతోపాటు మందు కూడా పీకల దాకా పోసే క్రమంలో ఈ అక్రమ సారా తయారీదారుల సహాయం తీసుకుంటారు. ఎన్నికల తరువాత ఈ నాయకుల అండతో సారా తయారీదారులు తెగబడుతున్నారు.



ఎదురించిన వారిని అండచూసుకొని తెగబడుతున్నారు.

కోర్టులు, పోలీసులు నామమాత్రం గానే వీరిని శిక్షిస్తున్నాయి. పేరుకు రెండు సంవత్సరముల నుండి జీవితఖైదు వరకు, రూ. 1000/- లు జరిమానా నుండి రూ. 1,00,000/- లు జరిమానా వరకు శిక్షలు ఉన్నా ఏళ్ళ తరబడి విచారణ వలన సాక్షులను భయకంపితులను చేయడంవలన దోషులు శిక్షార్హులు కాలేకపోతున్నారు. అన్ని విభాగాలలోను సిబ్బంది కొరత ఉన్నట్లే, ఈ విభాగాలలో కూడా తగినన్ని పోలీసు స్టేషన్లు, న్యాయస్థానాలు దానికి తగిన సిబ్బంది ఉండకపోవడం. స్టేషన్ బెయిలు 24 గంటల్లో లభ్యం అవ్వడం, నేరం ఋజువైనా అప్పీలు పేరుతో పై కోర్టుకు వెళ్ళి మరి కొన్నేళ్ళు కేసులు నడిపించడంవంటి చర్యలతో నేరస్థులకు భయం కలగడం లేదు. భారీగా సారా కాచినవాళ్ళు చుట్టుప్రక్కల ప్రాంతాలలోని పేదవారిని చేరదీసి కూలీకి వెళితే వచ్చే డబ్బుకన్నా ఎక్కువ ఇస్తామని ప్రలోభపెట్టి మహిళలు, పిల్లలచేత కూడా ఎక్కడపడితే అక్కడ ఈ నాటుసారా అమ్మిస్తున్నారు. ఈ విధంగా మారుబేరానికి నాటుసారా అమ్మే సుబ్బలక్ష్మి ఇలా అంటోంది "ఏదో కూలీ బ్రతుకులమీద బ్రతికేవాళ్లము, మాకు రోజు తిండి ఎట్లా గడుస్తుందని చూస్తాము గానీ, ఇది తప్పుఒప్పు అని ఎట్లా తెలుస్తాది?"

"మేమేమన్నా ఖూనీలు చేస్తున్నామా! పెద్ద పెద్దోళ్ళు ఎన్ని తప్పులు చేసినా బైట దర్జాగా తిరుగుతూ దండాలు పెట్టించుకోట్లా, ఈ యాపారం మేమేమి ఆస్థిలా మా పిల్లగాండ్రికి ఇవ్వం, ఏదో మా వరకే కొద్దిగా చేసుకుంటాం, ఏదో కర్మగాలి ఈ యాపారం కొన్నాళ్ళుచేసి మానేసినా ఎక్సైజు పోలీసోళ్ళు మాటిమాటికి మాపై కేసులు పెట్టి లెక్కలు చూసుకుంటారు. పోలీసోళ్ళకు సారాకాచే వాళ్ళమీదకెళ్ళే ధైర్యంచాలక కాస్తోకూస్తో అమ్ముకునే మాలోంటోళ్ళమీద ప్రతాపం చూపిస్తారు" అని ఆక్రోశం వెళ్ళగక్కింది. ఇదే విషయమై నూజివీడు డివిజన్ ప్రొహిబిషన్ మరియు ఎక్సైజ్ ఇన్స్పెక్టర్ చిల్లూరి స్వామిరెడ్డి గారు మాట్లాడుతూ "సాధారణంగా సారా అనేది ప్రభుత్వం చీపు సీసాల్లో ఖరీదైన ప్రీమియం బాటిల్స్‌తోబాటు అమ్ముతుంది. కానీ అది ఖరీదైన విషయం కాబట్టి పేద, బీద, బిక్కి జనాలు తమ వృత్తి భారాలు మర్చిపోవడానికి అక్రమ సారా మీద ఆధారపడతారు. దాదాపు ప్రతి గ్రామంలోనూ సారా కాస్తూంటారు. ఎక్కువగా గౌడ, వడ్డెర కులస్తులు చేస్తూంటారు. మనకు 4 లేదా 5 తండాలే సుగాలీలవి ఉన్నాయి. అక్కడవాళ్ళు కూడా కొంత మంది ఈ సారా కాపును వృత్తిగా చేసుకున్నారు. లంబాడీలలో స్త్రీలు కూడా మద్యం త్రాగుతారు. మేము ఎంత చెప్పినా సారా తయారీకీ, అమ్మకానికీ

అలవాటుపడ్డ నేరస్థుల్లో మార్పురాకపోవడం వలన చాలా మంది మృత్యువాత పడుతున్నారు. 30 సం॥ల నా సర్వీసులో అలాంటి మరణాలు 150 దాకా చూశాను. ఈ సంవత్సరమున్నరలో మన ప్రాంతాల్లో 20 సం॥లలోపు మగపిల్లలు ముగ్గురు కిడ్నీలు పాడైపోయి చనిపోయారు. రోజుకు 100 మి.లీ. ఐతే వెంటనే ప్రమాదం ఉండక పోవచ్చు. కానీ ఖరీదు తక్కువే కదా అని రోజుకు ఒక్కొక్కడు 180 నుండి 200 మి.లీ. వరకూ త్రాగుతున్నారు. నెలల్లోనో చనిపోతున్నారు. కల్లు అఫీషియల్‌గా అమ్ముతారు. ప్రభుత్వానికి రెవిన్యూ కడతారు. కానీ కల్లు వ్యాపారం కన్నా సారా వ్యాపారంలో డబ్బు ఎక్కువగా గడించవచ్చని ఇందులోకి మారుతున్నారు. ఈ అక్రమ సారా తయారీ ఆపాలన్నా, అమ్మకాలు జరగకుండా చూడాలన్నా ప్రభుత్వం సారా రేటు తగ్గించాలి. మా బాధ్యత మమ్ముల్ని నెరవేర్చ నీయకుండా రాజకీయ నాయకులు ఒక్కోసారి వత్తిళ్ళు తీసుకువస్తూంటారు. ఈ విధమైన జోక్యం ఉండకూడదు. ఈ బాధ్యత మా ఒక్కళ్ళది మాత్రమే అనుకోకుండా ప్రజా సంఘాలు, గవర్నమెంటు కూడా మాకు సహకరించి ప్రజలలో ఆరోగ్యంపట్ల అవగాహన పెంచితే బాగుంటుందని ఆయన అభిప్రాయం వ్యక్తం చేశారు.

ఏళ్ళ తరబడి విచారణ వలన సాక్షులను భయకంపితులను చేయడంవలన దోషులు శిక్షార్హులు కాలేకపోతున్నారు. అన్ని విభాగాలలోను సిబ్బంది కొరత ఉన్నట్లే, ఈ విభాగాలలో కూడా తగినన్ని పోలీసు స్టేషన్లు, న్యాయస్థానాలు దానికి తగిన సిబ్బంది ఉండకపోవడం. స్టేషన్ బెయిలు 24 గంటల్లో లభ్యం అవ్వడం, నేరం ఋజువైనా అప్పీలు పేరుతో పై కోర్టుకు వెళ్ళి మరి కొన్నేళ్ళు కేసులు నడిపించడంవంటి చర్యలతో నేరస్థులకు భయం కలగడం లేదు. భారీగా సారా కాచినవాళ్ళు చుట్టుప్రక్కల ప్రాంతాలలోని పేదవారిని చేరదీసి కూలీకి వెళితే వచ్చే డబ్బుకన్నా ఎక్కువ ఇస్తామని ప్రలోభపెట్టి మహిళలు, పిల్లలచేత కూడా ఎక్కడపడితే అక్కడ ఈ నాటుసారా అమ్మిస్తున్నారు.

ఈ అక్రమసారా తయారీ అమ్మకం కేసుల్లో నిపుణులైన సీనియర్ డిఫెన్స్ లాయరు మాట్లాడుతూ “గతంలో జరిగిన సెక్షన్. 41 సి.ఆర్.పి.సి. అమెండుమెంటు ప్రకారము గత 2 సం॥ల నుండి ముద్దాయిల్ని పట్టుకున్న గంటలోనే స్టేషన్ బెయిల్ పొంది తిరిగి ఇదేవృత్తి కొనసాగిస్తున్నారు. గణాంక లెక్కల కోసంఏమో గత 2,3నెలలుగా ఎక్సైజ్ మంత్రి అంధికారులు సారా రహిత రాష్ట్రంగా మారుస్తామని తెగప్రకటనలిస్తున్నారు. కొన్ని చోట్ల దాడులు నిర్వహిస్తునానరు. సారా వలనేగాక విజయవాడలో మద్యం షాపులో తాగిన వాళ్ళు కూడా మరణించారు. లాభాలు, డబ్బు తప్ప మానవప్రాణాలకు విలువలేని రాజ్యం నడుస్తుంది. అందువలనే అక్రమ మద్యమూ, సారా వ్యాపారము రోజురోజుకీ పెరుగుతుంది. పై అధికారుల ఒత్తిళ్ళ వలనో గతంలో ఇరుక్కున్న అమాయకులని తీసుకువచ్చి ఎటువంటి అక్రమ సారా దొరకకపోయినా దొరికినట్లు వ్రాసుకుంటారని ఆవేదన వ్యక్తం చేశారు.

ఇదే విషయాన్ని యువ న్యాయవాది కలపాల రామారావు గారు మాట్లాడుతూ దోషులకు శిక్షలు పడడం లేదు, కనీసం జరిమానా కూడా పడడంలేదు. పోలీసులు సాక్షులను ప్రవేశ పెట్టడంలోనూ, సాక్ష్యం చెప్పించడం లోనూ ఫెయిల్ అవుతున్నారు. విచారణ ఒక సంవత్సరం లోపు ప్రారంభమైనప్పటికీ, విచారణలో ఎలాంటి ఇబ్బందులు లేనప్పటికీ, సాక్షులు, ముద్దాయిలకు అనుకూలంగా సాక్ష్యం చెప్తుండడంవలన ఈ అక్రమసారా నియంత్రించడం కష్టం అవుతున్నది. పోలీసులు ఎటువంటి ఒత్తిళ్ళకు తలొగ్గకుండా సారా తయారీ అమ్మకాలను నియంత్రించాలి. పేద ప్రజల ప్రాణాలు కోల్పోకుండా వారి కుటుంబాలు నాశనం కాకుండా కాపాడాలి అని సూచించారు.

తాగుడుతో వచ్చే ప్రమాదాలను విస్తృతంగా ప్రచారం చేయాలి. మద్యం అమ్మకాల పై వచ్చే ఆదాయాన్ని పెంచు కోవడమెలాగా అని విధానాలు రూపొం దించరాదు. అక్రమంగా తమారీ దారులపై కఠిన చర్యలుండాలి. మద్యం మహమ్మారిని తరిమికొట్టాలని తాపత్రయపడిన దూబగుంట రోశమ్మ స్ఫూర్తి, మహిళల ఉద్యమ శ్రమ నిష్ఫలితమవడం శోచనీయం. చిన్న వయసు ఇల్లాళ్ళు భర్తలను కోల్పోయి వితంతు పెన్షను తీసుకోవడం కడు బాధాకరం.

త్రాగిన వాళ్ళ కిడ్నీలు పాడైపోయి తీరా చివరి క్షణంలో కుటుంబీకులు వారిని కార్పోరేటు ఆసుపత్రిలకు తీసుకువెళ్ళి ఉన్న ఇల్లు, కుంట పొలాలు అమ్ముకుని, తాకట్టుపెట్టి పిల్లల్ని బ్రతికించుకుంటే చాలని పడే ఆరాటం హృదయవిదారకం. ఈ విషాదానికి చరమగీతం పాడే కాలం రావాలి. పాలకుల ఆలోచనా విధానం మారాలి. తద్వారా ఈ వ్యవస్థ మారాలి.



# ధీశాలి యోగిత

- వేములపల్లి సత్యవతి



పొట్టకోసిన అక్షరం ముక్క రాని మహిళ కాదు. పోనీ వానాకాలం చదువులాగ ఏడవ తరగతో, పదో తరగతితో చదువు ముగించిన మహిళా కాదు. న్యాయ శాస్త్రంలో పట్ట భద్రురాలు. పెండ్లికి ముందు అత్తింటి వారు విసిరిన మాయలో చిక్కుకుంది. అత్తింటివారు తమ కుమారుడు భోపాల్ హైకోర్టులో న్యాయవాదిగా పనిచేస్తు న్నాడని చెప్పారు. ఆ మాటలను నమ్మిన యోగిత, రఘువన్షీల వివాహం 1991లో జరిగింది. వివాహానంతరం అతను న్యాయవాది కాదని తెలిసింది. మోనపోయానని గ్రహించింది. విపరీతమయిన మానసిక క్షోభకు గురయ్యింది. భోపాల్ హైకోర్టులో కొడుకు న్యాయవాదిగా ప్రాక్టీస్ చేస్తున్నాడని అత్తింటివారు చెప్పిన మాటలు ఎంత వరుకు వాస్తవమో తెలుసుకోవటం న్యాయవాది అయిన యోగితకు అసాధ్యమైన పనేమీకాదు. ఆ ఆలోచన ఆమెకు ఎందుకు తట్టలేదన్నది ఆశ్చర్యకరమైనదే! మోనపోయానన్న ముల్లు ఆమె మనసులో గుచ్చుకుంటూనే వుంది. వారి దాంపత్య జీవితం ఏమంత సుఖ-సంతోషాలతో సాగలేదు.

పులి మీద పుట్రలాగ యోగిత భర్త రోడ్డు ప్రమాదంలో చనిపోయాడు. అప్పటికి యోగిత ఇద్దరు బిడ్డల తల్లయ్యింది. పిల్లల పెంపకం, కుటుంబ నిర్వహణను గురించి ఆలోచించింది. న్యాయ వాది వృత్తి ప్రారంభిస్తే ప్రారంభంలో వచ్చే ఆదాయం సరిపోదు. ఎవరిదగ్గరన్నా జూనియర్‌గా పనిచేస్తే వచ్చే జీతం నామ మాత్రమే. ఈ గడ్డు సమస్యను దాటాలంటే ట్రక్ డ్రైవర్ పనిచేయటం లాభదాయకంగా తోచింది. యోగితకు ఏ రోజు డబ్బు ఆ రోజు చేతికందుతాయి. హైవే రోడ్ల మీద ట్రక్ నడపటం రిస్కుతో కూడుకున్న పని. మొక్కవోని ధైర్య సాహసాలతో, అచంచల ఆత్మ విశ్వాసంతో ట్రక్ డ్రైవర్ పని చేపట్టింది. ఉన్నత విద్యనభ్యసించి, న్యాయ శాస్త్రంలో పట్ట భద్రురాలై ట్రక్ డ్రైవర్‌గా మన దేశంలో పని చేసిన ప్రథమ మహిళ యోగిత.

ఎన్నో అవమానాలు, ఆవహేళన లను, తిరస్కారాలని రుచిచూచింది. వాటి వలన మానసికంగా కృంగి పోకుండా, ఎవరి మాటలను లెక్కచేయ కుండ తానెంచుకున్న మార్గంలో ముందుకు దూసుకు పోయింది. యోగిత హైవేలో ట్రక్ నడుపుతు న్నపుడు పోలీసులు లంచం కొరకు ఎక్కువ ఇబ్బంది పెట్టేవారు. “లంచం కావాలా! అయితే నీ ఫోటో తీసుకుంటాను. దానిని దగ్గరలో ఉన్న పోలీసు స్టేషన్‌లో ఇస్తాను. అందుకు సిద్ధమేనా” అని లంచం అడిగిన వారిని అడిగేది. అంతటితో వాళ్ల నోళ్ళు మూతపడేవి.

ఏలాంటి అవాంతరము లేకుండ హైవే మీద డ్రైవింగ్ చేసిన యోగితకు మహీంద్రా ట్రాన్స్ పోర్టు వారు 2013లో ఎక్స్ లెన్స్ అవార్డునిచ్చి సత్కరించారు. దానితోపాటు హై-ఎండ్ మహీంద్రా ట్రక్‌ను బహుకరించారు. ఆ ట్రక్ రోజుకు 500కిలో మీటర్లు ప్రయాణం చేయగల సామర్థ్యం కలిగి వుంది.

# సీరియల్ మరో అమ్మ : పశ్చిమ వర్జీనియాలో మారణకాండ

1902, అక్టోబర్‌లో రాక్షస బొగ్గు గని కార్మికుల సమ్మె ముగిసిన తరువాత, నేను ఇల్లినోయిస్ గని కార్మిక నాయకుడు జాన్ హెచ్. వాకర్‌తో కలిసి పశ్చిమ వర్జీనియాకు వెళ్ళాను. వాకర్ సమర్థుడు, ధైర్యశాలి కూడా. మేమిరువురం కలిసి అసంఘటితంగా వున్న కార్మికులకు సమావేశాలు పెట్టాము. ఫలితంగా స్మితర్స్ ఫీల్డ్, లాంగ్ ఎకర్, కానిల్‌టన్, బూమర్‌లలో యూనియన్లు ఏర్పడ్డాయి.

అయితే ఇది అంత సులువుగా జరగలేదు. అపాయం లేకుండా కూడా జరగలేదు అదృష్టవశాత్తు గుండె ధైర్యంగల నాయకులు దొరికారు. యూనియన్‌లో చేరిన కార్మికులను బ్లాక్‌లిస్ట్‌లో పెట్టారు. వాళ్ళ కుటుంబాలను రోడ్డు పాలు చేశారు. కాల్పులు జరిపారు. చితక్కొట్టారు. అనేక మంది అదృశ్యమయ్యారు, వాళ్ళజాడ కనుక్కోలేకపోయాము. యూనియన్ సభ్యుల కుటుంబాలకు పచారీ సరుకులు అమ్మడం నిషేధించారు. ఈ పరిస్థితుల్లో చెట్ల మధ్య నున్న నిషేదించారు. గనుల్లోను, పాడుబడ్డ భవనాల్లోనూ,రహస్యంగా అర్ధరాత్రుళ్ళు మీటింగులు వేసుకోవలసి వచ్చింది.

మౌంట్ హోప్‌లో మేము మీటింగు పెట్టాము. మీటింగు ముగిసిన తరువాత నేను, వాకర్ కలసి హోటల్‌కి తిరిగి వెళ్ళాము. ప్రొద్దు పోయేదాక మాట్లాడుకుంటూ ఉన్నాము. ఇంతలో ఒక గని కార్మికుడు లోపలకి వచ్చాడు. అతను పొడవుగా, సన్నగా వున్నాడు. బాగా దగ్గుతున్నాడు.

'అమ్మా! మేము 12 మందిమి వున్నాము, యూనియన్‌లో చేరుతాము' అని అన్నాడు.

తనతోపాటు నా గదికి మిగతా కార్మికులను తీసుకువచ్చాడు. వాకర్ వారికి యూనియన్ బాధ్యతలు వివరించి చెప్పాడు.

'నేను ఈ ప్రపంచమున్నంత వరకూ గనిలో ఉండే బొగ్గుగా ఉండదలచుకోలేదని, ఒక యూనియన్ సభ్యుడిగా చని పోవడానికైనా ఇష్ట పడతానని', ఆ గుంపులోని ఒక నాయకుడన్నాడు. యూనియన్ ఏర్పాటు కోసం ఏ త్యాగానికైనా సిద్ధపడతారని నాకు అర్ధమయింది.

'అబ్బాయిలూ, మీరు ఇప్పుడు 12 మంది ఉన్నారు. క్రీస్తు శిష్యులు కూడా 12 మందే. మీలో యూదులు లేరని, తోటివాళ్ళకు ద్రోహం చేసేవారు లేరని ఆశిస్తున్నాను. మీరు చేయబోయేపని మీ పిల్లల కోసం, మీ భవిష్యత్ కోసం, మెరుగైన భోజన వసతి కోసం. మీరు సృష్టించిన సంపద నుండి మీకు న్యాయంగా రావల్సిన పరిహారం కోసమని తెలుసుకోండి' అని చెప్పి వారిని ఉత్సాహపరిచాను.

ఆ వచ్చిన కార్మిక నాయకుడు విపరీతమైన దగ్గుతో బాధపడుతున్నాడు. బొగ్గుగనుల్లో పని అతన్ని జీవచ్ఛవంగా మార్చింది. వాళ్ళ దగ్గర యూనియన్ నిర్మాణానికవసరమైన డబ్బులు లేవని చెప్పారు. ఆ డబ్బులు నేను ఏర్పాటు చేస్తానని చెప్పాను.

మూడు వారాల తరువాత వారినుండి నాకు ఉత్తరం వచ్చింది. వాళ్ళ నాయకుడు చనిపోయాడని అయితే అతను 800 మందిని యూనియన్‌లో చేర్చాడని, యూనియన్ చందా పంపిస్తున్నామని ఒక కార్మికుడు వ్రాసాడు.

ఆనాటి గని యజమానుల కమీషనర్ డంకెన్ కెనడీని కాపర్‌టన్ మౌంటెన్ క్యాంపులో నేను కలిశాను.

ఈ మౌంటెన్ జిల్లాలో మేము



మీటింగులు పెట్టేవాళ్ళం. ఆ సందర్భాల్లో తరుచుగా మా ప్రక్క నుండి బుల్లెట్లు దూసుకుపోయే శబ్దాలు వినబడేవి. అయితే మేము నల్లని బట్టలు వేసుకొని, పెద్దబండ రాళ్ళ మధ్య కూర్చోవడం వలన చీకటిలో కలిసి పోయి తూటాలను తప్పించుకునేవాళ్ళం.

లారెల్ క్రీక్ అనే పట్టణానికి ఏడుగురు నాయకులను పంపించారు. వాళ్ళంతా దెబ్బలుతిని, కాల్పుల్లోగాయపడి టౌన్ నుండి వెనక్కి తిరిగి వచ్చారు. ఒక నాయకుడ్ని తుపాకులతో బెదిరించి తరిమికొట్టారు. నన్ను టౌన్‌లోకి వెళ్ళొద్దని, రోడ్ల మీద గన్ మెన్‌లు గస్తీ తిరుగుతున్నారని ఆ నాయకుడు చెప్పాడు.

గని కార్మికులు బందీలయ్యారని, వాళ్ళకు నా అవసరం ఉన్నదని నాకర్థమైంది. నేను, మరో పదిమంది గట్టి కార్యకర్తలతో కలసి ఒక శనివారం రాత్రి, లారెల్ క్రీక్‌కు సుమారు ఆరుమైళ్ళ దూరంలో ఉన్న ఫైర్‌కు వెళ్ళాము. ఆదివారం తెల్లవారు జామున అక్కడి నుండి లారెల్ క్రీక్‌కు నడిచివెళ్ళాము. నేను అక్కడ ఉన్న కొండపైకెక్కి క్యాంప్‌ను, మురికి వోడుతున్న కార్మికుల ఇళ్ళను చూశాను. అక్కడే ఒక రాయిమీద కూర్చుండిపోయాను. నాతో

వచ్చిన వాళ్ళను టౌన్‌లోకి వెళ్ళి మధ్యాహ్నం రెండుగంటలకు కొండదగ్గర సమావేశం ఉందని, మదర్‌జోన్స్ మాట్లాడతారని ప్రచారం చేయమన్నాను. అలాగే అక్కడి సూపరింటెండెంట్‌ను కూడా ఆహ్వానించామని చెప్పమన్నాను.

ఈ లోగా మైక్ హారింగ్టన్ అనే గని కార్మికుడు నన్ను తన ఇంటికి ఆహ్వానించాడు. నేను వెళ్ళాను. ఆ ఇంటిలోపలికి వెళ్ళగానే నాకళ్ళు అందంగా, బలహీనంగా ఉన్న ఒక అమ్మాయి మీద ఆగాయి. ఆ అమ్మాయి గడ్డితో నేసిన చాపమీద పడుకొని ఉంది. అమ్మాయి సమస్య ఏమిటని ఆ తండ్రిని అడిగాను. 'క్షయ' అని చెప్పాడు. తన జీతం కుటుంబం గడవడానికి సరిపోదని, అందువల్ల అమ్మాయి బోర్డింగ్ హౌస్‌లో పనికి వెళ్ళేదని చెప్పాడు. అక్కడ విపరీతంగా చాకిరీ చేయించుకున్నారని, దాంతో క్షయ రోగం వచ్చిందని చెప్పాడు.

చలిమంట చుట్టూ గుంపుగా పిల్లలు కూర్చున్నారు. ఆ పిల్లలు దుమ్ముకొట్టుకొని చింపిరిబట్టలతో ఉన్నారు. మైక్ హారింగ్టన్ మాకు టీ, బ్రెడ్డు ఇచ్చి మా ఆకలి తీర్చాడు.

మధ్యాహ్నం కొండవద్ద మీటింగుకు భారీ సంఖ్యలో కార్మికులు వచ్చారు. అక్కడికి సూపరింటెండెంట్ తన బంట్రోతులలో ఒకడ్ని పంపించాడు. అతను నల్ల జాతివాడు. అతను గూధచర్యం చేయడానికి వచ్చాడని గనికార్మికులు చెప్పిన మీదట, నేను అతనితో, 'చూడు బాబు, మీకు బానిసత్వం నుండి విముక్తినిచ్చిన లింకన్ మహాశయుడు తెల్లవాడని తెలీదా? మరి అలాంటప్పుడు పారిశ్రామిక స్వేచ్చ కోరుతున్న మీ తెల్లసోదరులను మీరెందుకు మోసం చేస్తున్నారని' అడిగాను.

అందుకు అతను 'అమ్మా! నన్ను నేను ఇప్పటికిప్పుడు మార్చుకోలేను' అని అంటూ ఉద్యమానికి తన సానుభూతి ఉంటుందని తెలియజేశాడు. ఆ మధ్యాహ్నం కొండ దగ్గర జరిగిన మీటింగు ఫలితంగా మేము గట్టి యూనియన్‌ను నిర్మించాము.

మరుసటి రోజున, మాకు భోజనం పెట్టిన కార్మికుడు మైక్‌ను పనిలో నుండి తీసేసారు. కంపెనీ ఆఫీసుకి వెళ్ళి అతనికి రావాల్సిన బకాయిలు తీసుకోమని చెప్పారు. ఆందోళనకారులకు ఆశ్రయం ఇచ్చిన వాళ్ళందరికీ ఇదే గతిపడు తుందని సూపరింటెండెంట్ హెచ్చరించాడు. మైక్ అతనితో, 'నేను ఆమెకు ఆశ్రయం కల్పించలేదు. ఆమెకిచ్చిన టీకి, బ్రెడ్డుకు డబ్బులు తీసుకున్నానని' సంజాయిషీ ఇచ్చాడు. అయినా అతను వినలేదు. 'ఆమె మీ ఇంట్లో ఉంది. అది చాలు, నిన్ను పనిలో నుండి తీసేయడానికి' అని అన్నాడు.

మైక్ ఇంటికి వెళ్ళాడు. తలుపు తెరిచాడు. అతన్ని చూడగానే, జబ్బుచేసిన అతని కూతురు 'నాన్న, పనిపోయిందా' అంటూ వెక్కివెక్కి ఏడ్చింది. దాంతో బాగా దగ్గు తెర వచ్చింది. ఆపై మూర్ఛపోయింది. అలానే వెనక్కి వాలి తలగడపై పడిపోయింది. ఈ లోకం విడిచిపోయింది.

ప్రస్తుతం అతను ఉంటున్న ఇల్లు కంపెనీది. కాబట్టి ఆ మధ్యాహ్నమే ఇల్లు ఖాళీ చెయ్యాలని కంపెనీ తాఖీదు ఇచ్చింది. దాంతో వాళ్ళు అమ్మాయిని పూడ్చిపెట్టి, ఒక పాత ధాన్యపుకొట్టులోకి మకాం మార్చారు.

ఆ తరువాత మైక్ యునైటెడ్ మైన్స్ వర్కర్స్ యూనియన్‌కు గట్టి కార్యకర్తగా తయారయ్యాడు. అతని సారథ్యంలో తయారయిన వర్గ చైతన్యంతో పదునెక్కిన కార్మిక వర్గాన్ని నేనింతవరకు చూడలేదు.

**మైక్ హారింగ్టన్ అనే గని కార్మికుడు నన్ను తన ఇంటికి ఆహ్వానించాడు. నేను వెళ్ళాను. ఆ ఇంటిలోపలికి వెళ్ళగానే నాకళ్ళు అందంగా, బలహీనంగా ఉన్న ఒక అమ్మాయి మీద ఆగాయి. ఆ అమ్మాయి గడ్డితో నేసిన చాపమీద పడుకొని ఉంది. అమ్మాయి సమస్య ఏమిటని ఆ తండ్రిని అడిగాను. 'క్షయ' అని చెప్పాడు. తన జీతం కుటుంబం గడవడానికి సరిపోదని, అందువల్ల అమ్మాయి బోర్డింగ్ హౌస్‌లో పనికి వెళ్ళేదని చెప్పాడు. అక్కడ విపరీతంగా చాకిరీ చేయించుకున్నారని, దాంతో క్షయ రోగం వచ్చిందని చెప్పాడు.**

1903ఫిబ్రవరిలో నేను స్టాన్‌ఫోర్ట్ మౌంటెన్‌కు వెళ్ళాను. అక్కడ కార్మికులు సమ్మె చేస్తున్నారు. దగ్గరలో ఉన్న ఇతర గనులకు ఈ కార్మికులు వెళ్ళడాన్ని నిషేధిస్తూ కోర్టు ఉత్తర్వులు ఇచ్చింది. అయినా గనులకు దూరంగా కొంతమంది కార్మికులు గుంపుగా పబ్లిక్‌రోడ్డు మీద నడుచుకుంటూ వెళ్ళారు. మరుసటి ఉదయం, సొంతంగా వాళ్ళు నిర్మించుకున్న భవనంలో సమావేశమయ్యారు. నిషేధాజ్ఞలు ఉల్లంఘించారని ఆరోపిస్తూ ముప్ఫై మంది సభ్యుల మీద వారెంట్‌లతో అక్కడికి యునైటెడ్ స్టేట్స్ డిప్యూటీ మార్షల్ వచ్చాడు.

'మేము చట్టాన్ని అతిక్రమించలేదు. గనుల దగ్గరకు వెళ్ళలేదు. పబ్లిక్‌రోడ్డు మీద ఉన్నామనే విషయం మీకు తెలుసునని' కార్మికులు వాదించారు. అయినా 'మిమ్మల్ని అరెస్టు చేయడం తప్పదన్నాడు' డిప్యూటీ.

కార్మికులు అరెస్టు కావడానికి తిరస్కరించారు. చట్టాన్ని ఉల్లంఘించలేదని నొక్కి చెప్పారు. అయినా 25 నిమిషాలలో టౌన్ వదిలి వెళ్ళిపోవాలన్నారు.

ఆ రాత్రి వాళ్ళ మీటింగుకు నేను వెళ్ళాను. జరిగిన విషయాలు చెప్పారు.

'అబ్బాయిలూ! న్యాయం మీ వైపు ఉంది. మీరు గనులవైపు వెళ్ళలేదు కాబట్టి లొంగిపోవడం మంచిదనిపిస్తుందన్నాను'.

సమావేశం తరువాత నేను ప్రక్కనే

ఉన్న మౌంట్ గోమేరీ క్యాంప్‌కు వెళ్ళాను. అక్కడ చిన్న హోటల్, రైల్వే స్టేషన్ ఉన్నాయి. నాకు వీడ్కోలి వ్వడానికి నాతోపాటు టౌన్ చివర వరకు వచ్చిన కార్మికులు, 'మీరు త్వరలోనే వస్తారుగా అమ్మా' అని అడిగారు.

ఆ రావడం ఎంత త్వరగా అన్నది నాకు తెలీదు.

మరుసటి రోజు ఉదయం, నేను ట్రైన్ ఎక్కడానికి స్టేషన్‌కి వెళ్ళాను. 'స్టాన్‌ఫోర్ట్‌లో రాత్రి జరిగిన ఘటనలు మీకు తెలీదా', అని స్టేషన్ ఏజెంట్ నన్ను అడిగాడు. నిన్న రాత్రి నేను అక్కడే ఉన్నానని చెప్పాను.

'నిజమే కాని, కాల్పులు జరిగాయి. పూర్తి వివరాలు నాకూ తెలీదు' అని అతనన్నాడు.

'నా టికెట్టు వెనక్కి ఇవ్వండి, నేను కార్మికులను కలవడానికి వెళ్ళాలి' అని టికెట్టు వెనక్కి తీసుకొని స్టాన్‌ఫోర్ట్ మౌంటెన్ కొండపైకి ఒక చిన్న బండిలో వెళ్ళాను. క్యాంప్‌లో ఇళ్ళు భయంతో వణుకుతున్నట్లు నాకనిపించింది. ప్రతిదీ నిర్జీవంగా ఉంది. కార్మికుల ఇళ్ళనుండి రోదనలు వినబడ్డాయి. ఇళ్ళ మట్టిగోడలు కార్మికుల రక్తంతో తడిసి పోయాయి. ఒక ఇంటి తలుపు తోశాను. రక్తపు మడుగులో ఉన్న చాపమీద ఒక కార్మికుడు పడి ఉన్నాడు. అతను నిద్రపోతు న్నప్పుడు, అతని బుర్రని తుపాకీతో పేల్చారు. తల నుజ్జునుజ్జైంది. అతని ఇల్లు బుల్లెట్లతో నిండిపోయింది.

క్యాంప్‌లో ఇళ్ళు భయంతో వణుకుతున్నట్లు నాకనిపించింది. ప్రతిదీ నిర్జీవంగా ఉంది. కార్మికుల ఇళ్ళనుండి రోదనలు వినబడ్డాయి. ఇళ్ళ మట్టిగోడలు కార్మికుల రక్తంతో తడిసిపోయాయి. ఒక ఇంటి తలుపు తోశాను. రక్తపు మడుగులో ఉన్న చాపమీద ఒక కార్మికుడు పడి ఉన్నాడు. అతను నిద్రపోతున్నప్పుడు, అతని బుర్రని తుపాకీతో పేల్చారు. తల నుజ్జునుజ్జైంది. అతని ఇల్లు బుల్లెట్లతో నిండిపోయింది.

ఇంకా మరో ఐదు ఇళ్ళల్లో కార్మికులు చచ్చిపడివున్నారు. ఒక ఇంటిలో ఒక పసివాడు తండ్రి శవంపై పడి ఏడుస్తున్నాడు. నన్ను చూసి 'మదర్‌జోన్స్! మా నాన్నని వెనక్కి తీసుకురండి, నేను మా నాన్నని ముద్దు పెట్టుకోవాలి అని', బోరున ఏడ్చాడు.

ఒక విచారణ అధికారి వచ్చాడు. కంపెనీ గన్‌మెన్‌లు ప్రశాంతంగా నిద్ర పోతున్న ఆరుగురు కార్మికుల్ని హత్య చేశారని నిర్ధారించాడు. విచారణ అధికారి వెళ్ళిపోయాడు. కార్మికుల్ని కొండవైపు పూడ్చిపెట్టారు. కార్మికుల ప్రాణాలు బలిగొన్న హంతకులను స్వేచ్ఛగా వదిలేశారు.

- (సశేషం..)

# మతోన్మాదం మంచిది కాదు

- ఎన్.ఎస్. లక్ష్మీదేవమ్మ

మతోన్మాదం మహమ్మారి లాంటిది. ఇది సోదర భావాన్ని చంపేస్తుంది. మానవు లంటే ఒక్కటేనన్న విశాల దృక్పథానికి తూట్లు పొడిచి సంకుచితత్వాన్ని ప్రోత్సహిస్తుంది.

ప్రేమ, దయ, కరుణ లాంటి పదాలకు చోటు ఇవ్వదు. ఏదైనా ఉన్మాదం పనికి రాదు. అందులోనూ మతోన్మాదం అసలు మంచిదికాదు. చారిత్రక ఘట్టాలు చూస్తుంటే మనసులు కలచివేస్తాయి.

దేశ విభజన సమయంలో ఊచకోతలు చూస్తుంటే అప్పటి దాక ఒకే దేశంలో అన్నద మ్ముల్లా బతికిన జనమేనా వీరు? అనిపిస్తుంది.

ఎందుకు ఇంత కిరాతకంగా మారారు? మనది లౌకిక రాజ్యం. అన్ని మతాలను గౌరవించాలి. ఎవరి మతం వారికి గొప్ప. మతాన్ని వ్యక్తి గతంగానే చూడాలి. అంతే గాని పరిపాలనలో అసలు తేకూడదు. గాంధీజీ కలలు కన్న భారత దేశం ఏనాడో నామ రూపాలు లేకుండా పోయింది. హిందూ మతమే గొప్పది అనుకునే వాళ్ళు కొందరు తయారయ్యారు. అలా అనుకోవడమే గాక అది ఉన్మాదంగా తలకెక్కించుకున్నారు. అందుకే ఎదుటి మతాన్ని దూషించడం, ద్వేషించడం మొదలెట్టారు. దీనికి ప్రతిగా మైనారిటీ మతస్థుల్లో కొందరు ఉన్మాదులుగా తయార య్యారు. ఏ మతోన్మాదమైనా దుర్మార్గమే. రోజు రోజుకు దేశంలో మత ఘర్షణలు ఎక్కువై పోతున్నాయి.

ముఖ్యంగా బాబ్రి మసీదు కూల్చి వేసిన తర్వాత మతోన్మాదశక్తులు మరింతగా పెరిగిపోయాయి.

బొంబాయి అల్లర్లు, గుజరాత్ నరమేధం, గోధ్రా అనంతర నరమేధంలో దాదాపు 2000 మంది ముస్లింలను ఊచకోచకోశారు.

ఈ ఆటవిక ఘటనలు దేశాన్నే కుదిపివేశాయి. ఆ మతం ఈ మతం అని కాకుండా మనసున్న ప్రతి ఒక్కరినీ కలచి వేశాయి. ఆనాడు గుజరాత్‌ను పాలిస్తున్న మోడీని నరరూప రాక్షసుడన్నారు. ఎందుకంటే మనది శాంతి కాముక దేశం. ఈ దేశంలో మతాలు ఎప్పటి నుండో వున్నాఅందరూ కలిసి సామరస్యంగా జీవిస్తున్నారు. ఈ సంస్కృతిని మతోన్మాదశక్తులు తెగనరికి దేశాన్ని అధోగతి పాలు చేస్తున్నాయి.

ఇప్పుడీ శక్తులే కేంద్రంలో అధికారం చేపట్టి విర్ర వీగుతున్నాయి. రెండేళ్ళలోనే వీరి ఫాసిస్టు పాలన పై మేధావులు, రచయితలు, విద్యార్థులు గళం విప్పారు. ఇలాంటి వాళ్ళను చరిత్ర క్షమించదు. ఫాసిస్టు హిట్లర్ ఏమయ్యాడు? ముస్సోలిని లాంటి నియంతలు ఏమయ్యారు? చివరకు కుక్కచావు చచ్చారు. వీళ్ళకీ అదే గతి పడుతుంది.

ఆరోగ్యం

# నడుము నొప్పి - కారణాలు-చికిత్స

- డా॥ భారతీ సాగర్

ఆధునిక కాలపు అతిసాధారణ ఆరోగ్య సమస్య నడుమునొప్పి. పురుషుల కన్నా స్త్రీలను చాలా సాధారణంగా బాధించే సమస్య ఇది. ఎందుకంటే నడుములో కండరాలు, వెన్నెముకకు సంబంధించిన కారణాల వలన స్త్రీ, పురుషులు ఇరువురికి నడుమునొప్పి వస్తుంది. అయితే, స్త్రీలలో ప్రత్యుత్పత్తి వ్యవస్థకి సంబంధించిన కారణాల వలన కూడా నడుమునొప్పి వస్తుంది. చెప్పాలంటే, మిగత కారణాల కన్న ఈ కారణం ఎక్కువ శాతం మందిలో నడుమునొప్పిని కలుగుచేస్తుంది. అయితే సాధారణ నడుమునొప్పికి యాంత్రికమైన కారణాలే ఎక్కువగా ఉంటాయి.

**కారణాలు:**

**1. దెబ్బ తాకటం:-** తీవ్రమైన నడుమునొప్పికి ముఖ్య కారణము వెన్నెముకకు దెబ్బ తగలడం లేదా వెన్నెముక విరగడం. వెన్నెముక విరిగినపుడు రోగి తీవ్రమైన నొప్పితో బాధపడతాడు. ఇంకా రెండుకాళ్ళను కదపలేని స్థితిలో ఉంటాడు. దెబ్బ తాకిన పరిస్థితులలో, ఇంకా వెన్నెముక విరగకుండా రోగిని జాగ్రత్తగా హాస్పిటల్‌కి తీసుకెళ్ళవలసి ఉంటుంది.

**2. స్ప్రెయిన్ మరియు స్ట్రైన్:-** అధిక బరువులు మోసినపుడు లేదా ఆటో/బైకులలో వెళ్ళుతున్నప్పుడు నడుముకి చిన్న చిన్న దెబ్బలు తాకి దానివలన నడుమునొప్పి వస్తుంది. అయితే నొప్పి మాత్రం దెబ్బ తగిలిన ప్రదేశంలోనే ఉంటుంది. క్రింది వైపు గానీ, కాళ్ళకి గానీ నొప్పి పాకదు.

**3. వెన్నుపూసలకి మధ్య ఉన్న డిస్క్ డిజనరేషన్:** రెండు వెన్నుపూసలకి మధ్య కుషన్ లాంటి నిర్మాణం ఉంటుంది. దానినే డిస్క్ intervertebral అంటారు. వయసు పెరిగే కొలది ఈ డిస్క్‌లో వయసు పెరిగేకొద్దీ డిస్క్‌కి ఉన్న రబ్బరు లాంటి కుషన్ లాంటి గుణం తగ్గిపోతూ వస్తుంది. వయసులో ఉన్నప్పటి వరకు ఇది మనం వంగటానికి, పక్కలకు తిరగటానికి, ముడుచుకోవటానికి సహాయపడుతుంది. కానీ వయసు మళ్ళటం ప్రారంభం కాగానే దీని కుషన్ లాంటి ప్రాపర్టీ తగ్గిపోయి వంగినా, ప్రక్కకి తిరిగినా నడుము నొప్పిని కలిగిస్తుంది.

అలాగే ఈ డిస్క్‌లు బాగా వత్తిడికి గురైనపుడు వెలుపలికి చొచ్చుకురావటం లేదా బద్దలవటం జరుగుతుంది. దీనివలన కూడా విపరీతమై నడుమునొప్పి వస్తుంది. దీనితోపాటు నడుము వంచలేకపోవటం, ఒకపక్కకి వంగిపోయినట్లుండటం వంటివి ఉంటాయి. డిస్క్ డిసీజ్‌లో నడుమునొప్పి ఒకపక్కనే వస్తుంది. కానీ రెండు పక్కల కూడా రావచ్చు, పెద్ద డిస్క్ ప్రభావితమైతే. డిస్క్ డీజనరేషన్ మాత్రం జరిగి, వెలుపలికి చోచ్చుకొని రాకుండా ఉంటే, అపుడు నడుము నొప్పితోపాటు ఒక్కోసారి కాళ్ళలో కాని హిప్ భాగంలో కానీ నొప్పివస్తుంది. ఇందులో నరాల మీద వత్తిడి పడదు.

**రాడికులోపతి:-** వెన్నుపూస నుంచి వచ్చే నరాల మూలంలో వత్తిడి వలన కానీ, దెబ్బతగలటం లేదా ఇన్‌ఫ్లమేషన్ వలన కానీ, నొప్పివస్తే దానిని రాడికులోపతి అంటారు. నరం మూలం మీద వత్తిడి వలన నొప్పి, తిమ్మిర్లు లేదా చురుకులు పోట్లు కలుగుతాయి. నడుము నుంచి ఇతర ప్రదేశాలకు కూడా నొప్పి పాకుతుంది.



**ఆర్థరైటిస్:-** ఎక్కువ శాతం నడుము నొప్పి వచ్చే కేసులలో ఆర్థరైటిస్ కారణంగా ఉంటోంది.

వెన్నుపూసకి వచ్చే ఆస్టియో ఆర్థరైటిస్ మలి వయసులో ఎక్కువగా వస్తుంది. అదికూడా మెడదగ్గర, నడుము దగ్గర ఉన్న వెన్ను పూసలలో ఎక్కువ వస్తుంది. దీనినే స్పాండైలోసిస్ అంటారు.

ఇందులో రోగికి నడుము నొప్పి కదిలినపుడు ఎక్కువ అవుతుంది అందువలన కదలికలు తగ్గిపోతాయి. నడుము పట్టేస్తుంది.

**యాంకైలోసింగ్ స్పాండైలైటిస్:-** వెన్నుపూసకి సంబంధించిన ఈ ప్రత్యేక ఆర్థరైటిస్ వ్యాధిలో రాత్రిపూట నడుమునొప్పి ఎక్కువగా ఉండటం, ఉదయం నడుము పట్టేయటం, విశ్రాంతి తీసుకున్నా నొప్పి తగ్గకపోవటం లాంటివి ఉంటాయి.

**స్పైనల్‌స్టెనోసిస్:-** వెన్నుపూసలో ఎక్కువగా తుంటి దగ్గర లేదా మెడ ధ్ధర, వెన్నుపూస లోపలి కాలువ రంధ్రం సన్నబడుతుంది. నడుమునొప్పి, తుంటి నొప్పి, కాళ్ళలో నొప్పులు ఉంటాయి. నడిచినపుడు, నిలబడినపుడు నొప్పి ఎక్కువవుతుంది. కూర్చుంటే నొప్పి

తగ్గిపోతుంది. సాధారణంగా ఇది రెండు పక్కల వస్తుంది.

**పుట్టుకతో వచ్చే లోపాలు:-** పుట్టుకతో నడుములో వచ్చే కొన్ని వికృతుల వలన కూడా నడుము నొప్పి వస్తుంది. వెన్నుపూసలో వచ్చే లోపాల ద్వారా స్పాండైలోలైసిస్ అనే వ్యాధి వస్తుంది. ఇది ఎక్కువ మహిళల్లోనే కనబడుతుంది.

**స్పాండైలో లిస్థెసిస్:-** వెన్నుపూస బాడీ, పెడికిల్స్ మొదలగు భాగాలు ముందుకు చొచ్చుకొని రావటంని స్పాండైలోసిస్ అంటారు. ఇదికూడా అడ వారిలోనే ఎక్కువగా వస్తుంది. స్పాండైలిస్థెసిస్ వెన్నెముక యొక్క డీజనరేటివ్ వ్యాధులలో ఎక్కువగా వస్తుంది. స్పాండైలోలిస్థిసిస్ వెన్నుపూస జారిపోవడం వలన వెన్నెముకలో స్టెనోసిస్ (లోపలి రంధ్రం సన్నబడిపోవటం) లేదా నరము దెబ్బతినటం జరుగుతుంది. ఇందులో కొన్ని సార్లు నొప్పి ఉండకపోవచ్చు, కానీ ఎక్కువసార్లు నొప్పి ఉంటుంది.

**ఇన్ఫెక్షన్లు:-** స్టెఫైలో కొక్కై లేదా ఇతర బాక్టీరియా వలన వెన్నెముకలో వచ్చే ఆస్టియోమైలైటిస్ వ్యాధిలోనూ, వెన్నెముకకు వచ్చే క్షయ వ్యాధి (పాట్స్ డిసీజ్)లో కూడా నడుము నొప్పి వస్తుది. కదిలినపుడు నొప్పి ఎక్కువగా ఉండటం, విశ్రాంతి తీసుకున్నా కూడా నొప్పి తగ్గకపోవటం, ఇన్ఫెక్షన్ ఉన్న వెన్నుపూసల వద్ద నొక్కినపుడు నొప్పి ఉండటం ఈ వ్యాధి లక్షణాలు, కొంత మందిలో జ్వరం రావటం, తెల్లరక్తకణాల సంఖ్య తగ్గిపోవటం కనబడుతుంది.

**కణుతులు:-** సాధారణ కణుతుల్లో కానీ లేదా కాన్సర్ వ్యాధిలోకూడా నరాల మీద వత్తిడి పడి నడుము నొప్పి వస్తుంది. కాన్సర్ మెటాస్టాసిస్ (కణజాలంలసికా సిరల ద్వారా శరీరంలో ఇంకో చోటుకి చేరుకోవటం). వెన్నెముకలోకి చేరుకోవటం వలన నడుము నొప్పి వస్తుంది. స్తనాలు, ఊపిరితిత్తులు, ప్రొస్టేట్‌గ్లాండ్, థైరాయిడ్, కిడ్నీ, జీర్ణనాళిక వీటికి సంబంధించిన కాన్సర్‌లలో జరిగే మెటాస్టాసిస్ వలన, మల్టిపుల్‌మైలోమా, హడ్జ్‌కిన్స్ మరియు నాన్-హడ్జ్‌కిన్స్ లింఫోమా మొదలగు కణుతులలో తరుచూ వెన్నుపూన ప్రభావితమవుతూ ఉంటుంది.

> **వెన్నుపూసకి వచ్చే ఆస్టియో ఆర్థరైటిస్ మలి వయసులో ఎక్కువగా వస్తుంది. అదికూడా మెడదగ్గర, నడుము దగ్గర ఉన్న వెన్ను పూసలలో ఎక్కువ వస్తుంది. దీనినే స్పాండైలోసిస్ అంటారు. ఇందులో రోగికి నడుము నొప్పి కదిలినపుడు ఎక్కువ అవుతుంది అందువలన కదలికలు తగ్గిపోతాయి. నడుము పట్టేస్తుంది.**

**వెన్నెముక వికృతులు :-** స్కోలియోసిస్ (గూని), ఆర్థోసిస్‌లో (నడ్డి)లాంటి వెన్నుముక అసాధారణంగా వంగిన పరిస్థితులలో మధ్య వయసు దాటిన తర్వాత నడుము నొప్పి వస్తుంది.

**కిడ్నీలో రాళ్ళు:-** కిడ్నీలో రాళ్ళు ఏర్పడినపుడు నడుములో తీవ్రమైన నొప్పి వస్తుంది.

**స్త్రీ జననాంగ వ్యాధులు:-** గర్భసంచి ముందుకి వంగకుండా వెనుకకి వంగినపుడు, గర్భాశయ ఎంటోమెట్రియాసిస్ వ్యాధి, గర్భాశయ కాన్సర్, గర్భసంచి జారిపోయి నపుడు, ఎక్కువ కాలం తెల్లబట్ట అవుతున్నపుడు స్త్రీలలో నడుంనొప్పి అధికమవుతుంది. పొత్తికడుపులో వచ్చే కణుతుల వలన, నెలసరి సమయంలో, గర్భధారణ సమయంలో కూడా నడుమునొప్పి వస్తుంది.

**మానసిక కారణాలు:-** హిస్టీరియా, మానసిక ఆందోళన లేదా డిప్రెషన్, మాదక ద్రవ్యాల అలవాటు, చిన్నతనంలో హింసకు గురవటం (శారీరక హింస లేదా సెక్సువల్ అబ్యూస్) లాంటి వాటిల్లో కూడా నడుము నొప్పి వస్తుంది.

**వీపుపై అధిక బరువులు:** టీనేజ్‌కి ముందు వయసులో పిల్లల్లో, స్కూలు పుస్తకాలు బరువు అధికంగా మోయటం వలన నడుమునొప్పి వస్తుంది. అందుకే అమెరికన్ అకాడమీ ఆఫ్ ఆర్థోపెడిక్ సర్జన్స్ సలహా ఏమిటంటే పిల్లలు వాళ్ళ శరీర బరువులో 15-20 శాతం బరువుకి పైబడి బరువుని మోయకూడదు.

**వృత్తిపరమైన రిస్కులు:** సరియైన స్థితిలో కాకుండా వంకరగా రోజంతా చెయిర్‌లో కూర్చొని చేసే వృత్తిలో; అధికంగా బరువులు మోసే వృత్తిలో వున్నవారికి అధికంగా నడుము నొప్పి వస్తుంది.

పైన చెప్పిన కారణాలే కాకుండా, గర్భధారణ సమయంలో, అతి స్థూల కాయులలో, జన్యు సంబంధిత కారణాల వలన కూడా నడుము నొప్పి వస్తుంది.

**వ్యాధి నిర్ధారణ:** నడుమునొప్పి కారణాన్ని బట్టి కొన్నింటిని రోగిని పరీక్షించటం ద్వారా నిర్ధారించవచ్చు. కొన్నింటిని లక్షణాల ద్వారా నిశ్చయించవచ్చు. అలాగే వెన్నెముక పరిస్థితి గురించి తెలుసుకోవాలనుకున్నప్పుడు, ప్లెయిన్ ఎక్స్‌రే, ఎమ్.ఆర్.ఐ స్కాన్, సిటి స్కాన్, మైలోగ్రామ్ లాంటివి అవసరమవుతాయి. అలాగే స్త్రీలకు సంబంధించిన రోగాలకు సోనోగ్రఫీ చేయించాల్సి ఉంటుంది.

# నిర్మల భారతం

- డా॥ఎం. ప్రగతి

కిటికీ చువ్వలు పట్టుకొని బయట చూస్తోంది రత్న. భర్త ఓబులేసు ఎప్పుడు లేచి వెళ్ళిపోయాడో తెలియదు. జరిగింది. తలచుకుంటుంటే తనకంతా కలగా వుంది. ఎప్పుడో రెండు మూడు సార్లు తప్ప వూరు దాటి బయటకొచ్చి ఎరగదు. మూడు రోజుల క్రితమే తన పెళ్లి ఓబులేసుతో జరిగింది. ఓబులేసు అనంతపురంలో ఆటో నడుపుతూ జీవనం సాగిస్తున్నాడు. ముందురోజు సాయంత్రమే తన వూరి నుంచి అనంతపురం వచ్చింది.

"వొదినా, ఇంటికి పోదాం పా!" ఓబులేసు చిన్న చెల్లెలు నాగమణి చెయ్యి పట్టి లాగేసరికి ఈ లోకంలోకి వచ్చింది రత్న. 'ఏ ఇంటికి?' అయోమయంగా అంది. "ఏ ఇంటికంటావేంది, మనింటికే." నవ్వేసింది నాగమణి. "ఇది మనిల్లు కాదా?" ఇంకా సందేహం తీరలేదు రత్నకు. "అమ్మో, ఇంత పెద్దిల్లు మనదా? ఇంకేం లేదు. ఇది పార్వతి అయవారమ్మ ఇల్లు. మాయమ్మ వీళ్లింట్లో పని జేస్తాది. అయవారమ్మ కాలవపల్లి బళ్ళో పాఠాలు చెబుతాది. ఈ సరికే బడికి పోయినాది. మనమూ మనింటికి పోదాం పా." అంటూ వదినను లాక్కెళ్ళింది. ఆ యింటికి నాలుగిండ్లవతల ఓ చిన్న పాకలాంటి కొట్టంలోకి తీసుకెళ్ళింది. వెనుక వంట చేసుకోవడానికి వారగా తడిక లాంటి గోడ. ముందర ఓ చిన్న మంచమేస్తే తిరగడానికి కూడా జాగా లేని గది. ఇదీ ఆ ఇల్లు. ఇంకా పెళ్ళికొచ్చిన చుట్టాలు పూర్తిగా పోలేదు. ఇల్లంతా సందడిగా వుంది. ఎవరితో మాట్లాడాలో అర్థం కాలేదు రత్నకు. రత్న కళ్ళు దేనికోసమో వెతుకుతున్నట్లు చూస్తున్నాయి. చివరికి రెండు గంటలు గడిచాక ఆడపడుచుతో మెల్లగా అంది, "బచ్చల్యాడ?" "రా చూపిస్తా" అంటూ నాగమణి ఇంటి వెనుక నాలుగు బండలు పాతిన చాటుకు తీసుకెళ్ళింది రత్నను. పైన కప్పు లేదు, వుందో లేదో అనిపించేట్లు ఓ తడికె అడ్డం.

బండల మధ్యలో సందులు. సిగ్గుతో చితికిపోయినట్లయింది రత్నకు. "ఏం బయం లేదులే వదినా, ఈడికెవరూ రారు." ధైర్యం చెప్పింది ఆడపడుచు. బయటికొస్తూ "మరి రొంటాలకు పోవాలంటే...?" అనుమానాన్ని ఆడపడుచు ముందుంచింది. "ఏముంది, చీకటేల లేచి దూరం పోవాల, లేదంటే పొద్దుగూకేదాకా అదిమి పట్టుకొని రాత్రికి పోవాల!" విడమరచిచెప్పేసరికి రత్నకు ఒక్కసారిగా తన కలలు చెదిరిపోయినట్లయింది. నీరసంగా ఇంట్లోకెళ్ళి కూలబడింది. తన వూరు గుర్తొచ్చింది రత్నకు.

పదో తరగతి ఫెయిల్ అయి ఇంటి దగ్గరే ఉండిపోయింది రత్న. నాట్ల కాలంలో, కోత కాలంలో మిగతా వాళ్ళతో పాటు తనూ కూలికి వెళ్ళేది. తిండికి అరకొర వున్నా పెద్దగా పట్టించుకోలేదు గానీ, ప్రకృతి అవసరాలకు మాత్రం ఈడేరినప్పటినుంచి ఎన్నో అగచాట్లు పడింది. తనే కాదు, వూళ్ళో ఆడపిల్లలకంతా ఇదే అవస్థ. మరుగుదొడ్లు వుండే ఇళ్ళు ఊరంతటికీ మూడే ఇళ్ళు. పోతే తెల్లారక ముందు పోవాలి లేదా మళ్ళీ చీకటి పడే దాకా ఆగాలి. అప్పుడు కూడా చెప్పలేనంత భయం. ఏ పురుగూ పుట్రా కుడుతుం దోనని. అలా కుట్టి ఎంతోమంది చచ్చి పోయారు కూడా. రత్నకు తన స్నేహితు రాలు లక్ష్మి గుర్తొచ్చింది. లక్ష్మి మీద ఎన్నాళ్ళ నుంచో కన్నేశాడు శివ. ఓ రోజు చీకటి బడ్డాక చెంబట్టుకు పోయిన లక్ష్మి మళ్ళీ ఇంటికి రాలేదు.

మరునటి రోజు తెల్లారేసరికి ఊరిబయట చింత చెట్టుకు శవమై వేలాడింది. ముందురోజు లక్ష్మిని శివ చాటుగా వెంబడించడం తర్వాత తెలిసింది. అప్పటినుంచి ఏ ఆడపిల్ల ఎంత అవసరమైనా ఒంటరిగా వెళ్ళడానికి భయపడేది. అప్పుడే తీర్మానించుకుంది రత్న. తను పెళ్ళి చేసుకునే ఇంట్లో ఖచ్చితంగా ఆ అవసరానికి బయలకు పోవాల్సిన పరిస్థితి వుండకూడదు. తనకు తెలిసి టౌన్లో అన్ని ఇళ్ళల్లో లెట్రిన్ సౌకర్యం ఉంటుందని తను అనుకునేది. అందుకనే పల్లెటూరి సంబంధాలెన్ని వచ్చినా కాదని, టౌన్లో ఆటో డ్రైవర్‌గా చేస్తున్న ఓబులేసుని చేసుకోవడానికి ఒప్పుకుంది. తీరా చూస్తే ఇక్కడ కూడా అదే పరిస్థితి. అంటే



కోడలు మెచ్చిన
మంచి అత్త

బహూ కోసం ఇంటి
ఆవరణలో మరుగుదొడ్డి
సొంత సొమ్ముతో నిర్మాణం

జీవితాంతం తను ఈ అవస్థ పడాల్సిందేనా?

రత్న ఆలోచనలు ఇలా సాగుతుంటే అవతల ఆమె అత్త వెంకటలక్ష్మి ఆలోచనలు మరో విధంగా సాగుతున్నాయి. పల్లెలో పని చేసుకుంటూ వుండేవాళ్ళకు కరువు పుణ్యమా అని పనులు కరువైపోయాయి. పదేళ్ళ క్రిందట భర్త నారాయణ ఓ రోజు వెంకటలక్ష్మితో "లచ్మీ, ఈడ పని దొరకడం కనా కష్టమైపోయింది. ఇట్టనే వుంటే పిల్లలు ఆకలితో మాడి సస్తారు. నేను అనంతపురం పోయి ఏ అమాలీపనో చూసుకుంటా" అన్నాడు. "నువు బోయినాక నేను మటుకు ఈడేం జెయ్యాల? నేనూ, పిల్లోల్లు గూడా వత్తాం. ఆడే నేనూ ఏదో పని సూసు కుంటా." అని వెంకటలక్ష్మి భర్త వద్దన్నా వినకుండా, పిల్లలతో సహా భర్తతో అనంతపురం చేరింది. వాళ్ళనుకున్నంత తేలిగ్గా అక్కడేం పనులు దొరకలేదు. చివరికి నారాయణ ఓ తోపుడు బండి బాడుగకు తీసుకొని, కూరగాయలు వీధుల్లో అమ్మడం మొదలు పెట్టాడు. వెంకటలక్ష్మి వాళ్ళనూ వీళ్ళనూ పట్టుకొని నాలుగిళ్ళల్లో ఇంటిపనికి కుదిరింది. అలా కాలవపల్లిలో టీచర్‌గా పని చేస్తున్న పార్వతి ఇంట్లో పనికి కుదిరింది. తన పని వేళలకు అనుగుణంగా రావడంతోపాటు, పనిలో నిదానం, ఓపిగ్గా పని చేయడం, నమ్మకంగా ఉండటంతో పార్వతికి బాగా దగ్గరైంది.

ఓబులేసుకు పెద్దగా చదువబ్బలేదు. ఇంటర్ ఫెయిల్ అయి, నాలుగేళ్ళు బలాదూర్‌గా తిరిగి, వాళ్ళమ్మ పోరు పెట్టడంతో చివరికి ఓ ఆటో అద్దెకు తీసుకొని నడపడం మొదలెట్టాడు. ఓబులేసు కాస్త కుదురుకున్నాక ఎవరి ద్వారానో ఈ సంబంధం గురించి తెలిసి ఖాయం చేసుకున్నారు. వెంకటలక్ష్మి మొదటి శుభలేఖ

**రత్నకు తన స్నేహితురాలు లక్ష్మి గుర్తొచ్చింది. లక్ష్మి మీద ఎన్నాళ్ళ నుంచో కన్నేశాడు శివ. ఓ రోజు చీకటిబడ్డాక చెంబట్టుకు పోయిన లక్ష్మి మళ్ళీ ఇంటికి రాలేదు. మరుసటిరోజు తెల్లారేసరికి ఊరిబయట చింత చెట్టుకు శవమై వేలాడింది. ముందురోజు లక్ష్మిని శివ చాటుగా వెంబడించడం తర్వాత తెలిసింది. అప్పటినుంచి ఏ ఆడపిల్ల ఎంత అవసరమైనా ఒంటరిగా వెళ్ళడానికి భయపడేది. అప్పుడే తీర్మానించుకుంది రత్న, తను పెళ్ళి చేసుకునే ఇంట్లో ఖచ్చితంగా ఆ అవసరానికి బయలకు పోవాల్సిన పరిస్థితి వుండకూడదు. తనకు తెలిసి టౌన్లో అన్ని ఇళ్ళల్లో లెట్రిన్ సౌకర్యం ఉంటుందని తను అనుకునేది. అందుకనే పల్లెటూరి సంబంధాలనెన్ని వచ్చినా కాదని, టౌన్లో ఆటో డ్రైవర్‌గా చేస్తున్న ఓబులేసుని చేసుకోవడానికి ఒప్పుకుంది. తీరా చూస్తే ఇక్కడ కూడా అదే పరిస్థితి. అంటే జీవితాంతం తను ఈ అవస్థ పడాల్సిందేనా?**

పార్వతికిచ్చింది. "అమ్మా, నాల్రోజులు పన్లోకి రాలేను. ఏమనుకోవద్దమ్మా" అని చెప్పింది. "ఫరవాలేదులే వెంకటలక్ష్మీ, అన్నట్టు పెళ్ళికి బంధువులంతా వస్తారేమో కదా, మీ ఇల్లు ఇరుకవుతుందేమో, అవసరమైతే మా ఇంటి పై గదిని వాడుకోండి. నీకూ వీలైనప్పుడు గది తాళాలు తీసుకొని బాత్రూంతో సహా మొత్తం శుభ్రం చేసుకో" భరోసా ఇచ్చింది పార్వతి. దాంతో వెంకటలక్ష్మి కొత్త దంపతులకు పడక ఆ గదిలో ఏర్పాటు చేసింది. "నాల్రోజులు ఎట్టానో గడిసిపోతాది? మల్ల ఏంజెయ్యాల? కొత్త కోడలుతన అవసరాల కోసం యాడికని పోతాది? ఇప్పటికే ఈ కొట్టానికి పదైదు నూర్లు బాడిగిచ్చుకుంటాండం. ఇంతకంటే వసతి గావాలంటే ఇంకా ఎయ్యి రూపాయల పైనే పెట్టాల. ఎట్టా తీసక రావాల? ఏం జెయ్యాల?'' వెంకటలక్ష్మి దిగులు పడిపోసాగింది.

నాలుగురోజులు గడిచిపోయాయి. ఇక మర్యాదగా ఉండదని గది తాళాలు పార్వతికి ఇచ్చేసింది వెంకటలక్ష్మి. రత్న ఏం చెయ్యాలో పాలుపోక, ఎవరికి చెప్పాలో అర్థం కాక తనలో తనే మధన పడుతోంది. ఇలా ఆలోచిస్తుండగానే రేడియోలో విద్యాబాలన్ ప్రకటన వస్తోంది. "అసలైన హీరోయిన్ ప్రియాంక భారతి, స్వచ్ఛత కోసం, ఆత్మగౌరవం కోసం పెళ్ళయిన రెండోరోజే అత్తవారిల్లు వదిలి పుట్టింటికి చేరింది. మరుగుదొడ్డి కావాలని భర్తతో పోరాడింది. ఆలోచన వుంటే మరుగుదొడ్డి వస్తుంది." రత్నకు విద్యాబాలన్ దారి చూపించినట్లయింది. "అయితే ఎట్ట మొదలు పెట్టాల? టీవీల్లో, సినిమాల్లో చెప్పినంత తేలిక కాదు గదా జీవితం." చివరికి ఆ రోజు రాత్రి ధైర్యం కూడగట్టుకొని భర్తతో అన్నది, "నాకు మా యమ్మనూ, నాయన్నూ సూడాలని పిస్తాంది. రేపు పొద్దుగాల మావూరికి బోయి రెండ్రోజులు వుండి వస్తా." "అక్కడికి పోయినాక మల్ల సూసుకోవచ్చు." మనసులో అనుకుంది. తల్లికి ఏదో విధంగా చెప్పి, ఓబులేసు ఎవరో పోతుంటే వాళ్ళతో రత్నను వూరికి పంపించాడు.

అలా పుట్టింటికి చేరిన రత్న రోజులు గడిచినా తిరిగి రాలేదు. ఫోను చేసిన ప్రతిసారీ ఏదో ఒక సాకు చెప్పేది. విషయం అర్థంకాని అత్తమామలు చివరికి నేరుగా రత్న దగ్గరికి వెళ్ళారు. అప్పుడు చెప్పింది అసలు సంగతి, " మరుగుదొడ్డి కట్టిస్తేనే కానీ నేనా ఇంటికి రాను." తెల్లబోయింది వెంకటలక్ష్మి. వెంటనే తేరుకొని, "అది మనిల్లు కాదమ్మా, పదైదు నూర్లు బాడిగిచ్చి వుండామాడ. అర్థం చేసుకో తల్లీ" నచ్చ జెప్పాలని చూసింది. "అయితే అన్నీ వుండే ఇల్లే బాడిక్కి తీసుకుంటే

పోలా?'' బాణంలా దూసుకొచ్చింది సమాధానం. "మనకొచ్చే ఆదాయం ఆడికాడికే గదమ్మా. అయినా యాడో ఇంటికి జాగా ఇస్తారంట, అప్పుడు నువ్వన్నట్టు బాగా ఏసుకుందాం, రామ్మా మనింటికి." ఏం చెప్పినా వినే పరిస్థితిలో లేదు రత్న. "అయితే అప్పుడే వస్తా మీ ఇంటికి." కరాఖండిగా చెప్పింది. రత్న అమ్మానాన్నలు నచ్చ చెప్పాలని చూసినా వినలేదు. చేసేదేమిలేక వెంకటలక్ష్మి దంపతులు తిరిగి వచ్చారు. వాళ్ళు చెప్పింది విని మండిపడ్డాడు ఓబులేసు. "రాకపోతే పోనీ, ఏం వాళ్ళింట్లో అన్నీ వున్నాయంటనా? సావనీ ఆడనే."

గిన్నెలు కడుగుతున్న వెంకటలక్ష్మి పరధ్యానంగా నీళ్ళు వదిలేయడం చూసిన పార్వతి కొళాయి కట్టేసి, "ఏమైంది వెంకటలక్ష్మి, ఎందుకో దిగులుగా వున్నావు." పార్వతి ప్రశ్నకు మొత్తం కథంతా చెప్పింది వెంకటలక్ష్మి. "ఏం చెయ్యాలో నువ్వన్నా చెప్పమ్మా." బావురుమంది. "ఏమైనా నీకోడలు చాలా తెలివైనది. ఓసారి నేను మాట్లాడనా?" "వద్దు లేమ్మా, ఆ పిల్ల మళ్లా నిన్నేమన్నా అంటే మాకు బాధ" వెంకటలక్ష్మి మాటలను పట్టించుకోకుండా "పర్లేదులే, నేను నా పద్ధతిలో మాట్లాడతా. రేపోసారి ఫోన్ నెంబర్ తీసుకురా." పార్వతి గట్టిగా చెప్పేసరికి మరుసటిరోజు నంబరు తెచ్చి చేతిలో పెట్టింది వెంకటలక్ష్మి. పార్వతి ఫోనులో రత్నతో మాట్లాడింది. 'ఏమైనా నీ ధైర్యం, తెగింపు చాలా గొప్పవి రత్నా! మా లాంటి వాళ్ళు కూడా నిన్ను చూసి నేర్చుకోవాలి.'' పార్వతి మాటలతో పొంగిపోయింది రత్న. "నేను నిన్నోసారి కలవాలనుకుంటున్నా, నువ్వు రాగలవా?" పార్వతి ప్రశ్నతో భయపడింది రత్న. "ఈ అయవారమ్మ ఆ మాటా ఈ మాటా సెప్పి, ఆడే వుండిపొమ్మని సెప్తాదేమో" అని మనసులో అనుకొని, "నేన్రానమ్మా ఆడికి, మా అత్తతో సెప్పినాను గదా." మొహానే తేల్చి చెప్పింది రత్న. "నేను ఆ విషయం గురించి కాదు నిన్ను రమ్మంటుంది. నీతో మాట్లాడాలి. పోనీ నన్నే మీ ఊరికి రమ్మంటావా?" ఇక తప్పదనుకున్న రత్న, "సరేనమ్మా, నేనే వస్తా. కానీ నన్ను మా అత్తింటికి పొమ్మని సెప్పగూడదు." షరతు పెట్టింది. "అలాగే, నిన్నెవరూ బలవంతం చేయరు."

**"మరేం లేదు రత్నా, మరుగుదొడ్డి కావాలని నువు చేసే పోరాటం గురించి మా బళ్ళో పిల్లలకు, టీచర్లకు చెప్పాలి. మా బళ్ళో కూడా ఆ సౌకర్యం లేదు. మేమూ ఎన్ని తిప్పలు పడతామో నీకు తెలీదు. పొద్దున నంగా ఇంట్లో పోతే మళ్ళీ ఇంటికొచ్చే వరకూ కంట్రోల్ చేసుకొని వుండాలి. మేమెవరిమీద పోట్లాడాలి? ప్రభుత్వం మీదనే కదా. మావాళ్లకు అంత ధైర్యం లేదు. అందుకే నీలాంటి ధైర్యశాలి ఓ సారి వాళ్ళతో మాట్లాడితే..."**

పార్వతి హామీతో ఆపై ఆదివారం తన అత్త పనిలో ఉండని సమయంలో పార్వతి ఇంటికి తన అన్నతో కలసి వచ్చింది రత్న. "మంచినీళ్ళు తాగుతావా?" అంటూనే తెచ్చి ఇచ్చింది. "ఏమిటి, లెట్రిన్ కోసం అత్తింటితో పెద్ద పోరాటమే చేస్తున్నావు?" ఉపోద్ఘాతం లేకుండా నేరుగా విషయంలోకి వచ్చింది పార్వతి. "అదీ..." నసిగింది రత్న. "నా కంతా తెలుసులే. అయినా ఈ మాత్రం పట్టుదల అమ్మాయిలకు చాలా అవసరం. నిజానికి నీలాంటి చురుకైన, తెలివైన పిల్ల దేశానికి చాలా అవసరం. మా స్కూలుకొస్తావా ఓ సారి.'' రత్న తలగోక్కుంది. " ఈ అయవారమ్మ ఏం మాట్లాడతాంది. ఏదో వాళ్ళ గది వాడుకొమ్మని సెప్తాదేమోనని ఒకింత ఆశగా వుండేది. ఈయమ్మేమో ఏందేందో సెప్తాంది." రత్న మనసును చదివినట్లుగా అందుకుంది పార్వతి, "మరేం లేదు రత్నా, మరుగుదొడ్డి కావాలని నువు చేసే పోరాటం గురించి మా బళ్ళో పిల్లలకు, టీచర్లకు చెప్పాలి. మా బళ్ళో కూడా ఆ సౌకర్యం లేదు. మేమూ ఎన్ని తిప్పలు పడతామో నీకు తెలీదు. పొద్దుననంగా ఇంట్లో పోతే మళ్ళీ ఇంటికొచ్చే వరకూ కంట్రోల్ చేసుకొని వుండాలి. మేమెవరిమీద పోట్లాడాలి? ప్రభుత్వం మీదనే కదా. మావాళ్లకు అంత ధైర్యం లేదు. అందుకే నీలాంటి ధైర్యశాలి ఓ సారి వాళ్ళతో మాట్లాడితే..." ఆగింది పార్వతి. "నేనేదో అత్తింటి వాల్లను బయపెట్టో, బెదిరించో పని జరుపు కోవాలనుకుంటే, ఈ యమ్మేంది పెద్ద పని పెట్టేతట్లుంది." మనసులో అనుకొని పైకి మాత్రం "అమ్మా మీరు పెద్దోళ్ళు, మీకు నేను సెప్పేటంతటి దాన్నా? నన్నొదిలేయమ్మా." అనేసింది. "లేదు రత్నా, ఇది నీ ఒక్కదాని సమస్య కాదు, చాలా మంది ఆడవాళ్ళ సమస్య. అంతెందుకు, మీ వూళ్ళో పరిస్థితేమిటి? అక్కడ కూడా దూరం పోవాల్సిందే కదా, రేపు మీ అన్నకు పెళ్ళయితే మీ వదిన కూడా నీలాగే ఆలోచిస్తే...? ప్రభుత్వాలు తమ బాధ్యత నుండి తప్పుకోవడానికి కుటుంబ సభ్యుల మధ్య అయిన వాళ్ళ మధ్య విభేదాలు సృష్టిస్తాయి. అందులో భాగమే విద్యాబాలన్ ప్రకటన. మీ అత్త ఇంకా అందరూ ఇంటి జాగా కోసం పోరాడుతునానరు. ఆ పట్టాలేవో వచ్చేస్తే అప్పోసప్పో చేసైనా ఇంట్లో ఆడ పిల్లలు బయటకు పోకుండా ఇల్లు కట్టించుకోవాలని మీ అత్త అగచాట్లు పడుతోంది. చుట్టుపక్కల ఆడోళ్ళను కూడగడుతోంది. నీ లాంటి తెలివైన, చురుకైన, ధైర్యవంతురాలైన పిల్ల ఆమె చేసే పోరాటంలో తోడైతే మరింత బలమొస్తుంది. అవునా, కాదా చెప్పు!" పార్వతి మాటలతో ఆలోచనలో పడింది రత్న. ●

# పగటి కల

- గిజుభాయి బగేకా



నేను పిల్లల్ని పలకరించాను. "రండి మనం శాంతి ఆట ఆడుదాం. చూడండి, నేను 'ఓం శాంతి: అంటాను. అప్పుడు అందరూ మౌనంగా కూర్చోవాలి. అందరూ వరుసలో పద్మాసనం వేసి కూర్చోవాలి. ఎవరూ కదలకూడదు. మెదలకూడదు. తరువాత నేను తలుపులు మూసివేస్తాను. అప్పుడు చీకటిగా వుంటుంది. మీరంతా ప్రశాంతంగా వుండాలి. మీకు పరిసరాల కోలాహలం వినిపిస్తుంది. అది వింటుంటే చాలా ఆనందంగా ఉంటుంది. మీకు ఈగల మోత వినిపిస్తుంది. మీ ఉచ్ఛ్వాస నిశ్వాసాలు కూడా వినిపిస్తాయి. తరువాత నేను పాట పాడతాను. మీరందరూ వినండి.'

ఇదంతా చెప్పిన తరువాత నేను శాంతి ఆట ప్రారంభించాను. నేను 'ఓంశాంతి' అన్నాను కానీ పిల్లలు తన్నుకుంటూ, గుద్దుకుంటూ, తగవులాడు కుంటూ, ఇష్టం వచ్చినట్లు మాట్లాడుకుంటూ వున్నారు. రెండు మూడు సార్లు హెచ్చరించాను. కాని నా మాటలు గాలిలో కలసిపోయాయి. నేను మనసులో కొంచెం సిగ్గుపడ్డాను. మౌనంగా వుండమని ఎలా చెప్పేది? అల్లరి వద్దని ఎలా చెప్పేది? చెంపలు వాయించి ఎలా భయపెట్టేది? అయినా ఫర్వాలేదనుకొని నేను ముందుకు సాగిపోయాను. కిటికీలు మూసివేశాను. అంతా చీకటైపోయింది. తరువాత ధ్యానం (?) కొనసాగింది. పిల్లల్లో ఎవరో 'ఊ,ఊ' అంటున్నాడు. ఒకడు 'హోవ్, హోవ్' అని అరుస్తున్నాడు. ఒకడు దబదబా కాళ్ళు నేలకేసి బాదుతున్నాడు. ఇంతలో ఒకడు చప్పట చరిచాడు. దానితో అందరూ చప్పట్లు చరుస్తూ వున్నారు. తరువాత ఒకడు నవ్వాడు. వెంటనే అందరూ నవ్వారు. నేను సిగ్గు పడ్డాను. నా ముఖం వెల వెల బోయింది. నేను కిటికీలు తెరిచాను. కొంచెం గది బయటకు వెళ్ళి మళ్ళీ తిరిగి వచ్చాను. క్లాసంతా అల్లరితో నిండి పోయింది. పిల్లలు ఒకరినొకరు 'ఓం శాంతి:' అని చెప్పు కుంటున్నారు. కొందరు నిలబడి స్వయంగా కిటికీలు మూసేస్తున్నారు.

నేను ఆలోచించాను. నేను తయారు చేసుకున్న నోట్సు వ్యర్థమైపోయింది. ఇంట్లో కూర్చొని నోట్స్ తయారుచేసుకొని ఊహాజగత్తులో బోధించడం సులభమే. కానీ యిక్కడ ఇనుపగుగ్గిళ్ళు నమలవలసి వస్తున్నది. గతంలో వాళ్ళు నేర్చుకున్నది అల్లరి చేయడమేనన్నట్లుగా వుంది. ఇప్పటి వరకూ వాళ్ళు అటువంటి కోలాహలం మధ్య పెరుగుతూ వచ్చారు. వాళ్ళముందు శాంతి ఆట ఆడటం బర్రె ముందు భాగవతం చదివినట్లుగానే వుంది. అయినా విచారించలేదు. మొదటి ముద్దలోనే ఈగ పడిందన్నట్టుగా అయింది. రేపటి నుంచి మరోకొత్త కార్యక్రమం ప్రారంభిస్తాను.

నేను క్లాసులోకి వచ్చాను. పిల్లలతో చెప్పాను. "అబ్బాయిలూ, ఈ రోజు ఇంతకన్న ఎక్కువగా చేసే పనేమీలేదు. రేపటి నుంచి ఒక కొత్త కార్యక్రమం ప్రారంభిద్దాం. ఈ రోజుకు సెలవు తీసుకోండి".

సెలవు మాట వినగానే పిల్లలు 'హో-హో' అంటూ కేకలు వేస్తూ క్లాసులోనుంచి బయటకి వచ్చేశారు. పాఠశాలంతా గందరగోళంతో నిండి పోయింది. వాతావరణమంతా 'సెలవు, సెలవు' అంటూ ప్రతిధ్వనించింది. నాలుగవ తరగతి పిల్లలు ఎగురుతూ దుముకుతూ, గంతులు వేసుకుంటూ ఇంటి దారిపట్టారు.

ప్రక్కనున్న విద్యార్థులూ, ఉపాధ్యాయులూ 'ఇదేమిటా!' అని వింతగా చూస్తూ వుండిపోయారు. ప్రధానోపాధ్యాయుడు గబగబా నా దగ్గరకు వచ్చాడు. నొసలు విరిచాడు. "మీరు వాళ్ళకు సెలవు యెందుకిచ్చారు? ఇంకా రెండు గంటలు పాఠశాల జరగాలి కదా!" అన్నాడు.

నేనన్నాను- "అయ్యా, పిల్లలు యీ రోజు ఆసక్తి చూపడంలేదు. అందరూ అస్తవ్యస్తంగా వున్నారు. శాంతి ఆటతోనే ఆ విషయం నాకు అర్థమైపోయింది."

ప్రధానోపాధ్యాయుడు కొంచెం కటువుగా అన్నాడు "వాళ్ళు యెట్లావున్నా సరే నన్ను అడగకుండా మీరు ఈ విధంగా సెలవు యివ్వడానికి వీలులేదు. ఒక క్లాసు పిల్లలు ఇళ్ళకు వెళ్ళిపోతే మిగిలిన వాళ్ళు ఎలా చదువుతారు? మీరు చేస్తున్న ఈ ప్రయోగాలు ఇక్కడ పనికిరావు."

ఆయన కొంచెం కోపం తెచ్చుకొని

మళ్ళీ అన్నాడు – "మీరు చెపుతున్న ఆసక్తి–గీసక్తి అవధానం–గివధానం అన్నీ కట్టి పెట్టండి. శాంతి ఆట మాంటిస్సోరి పాఠశాలలోనే ఉంటుంది. ఇక్కడ శాంతి ఆట నవ్వులాటగా ఉంటుంది. ప్రాథమిక పాఠశాల పిల్లలు చెంపదెబ్బపడితేనే చెప్పినట్లు వింటారు. అందరు నియమ పూర్వకంగానే చదువుతున్నారు, చదివిస్తున్నారు. మీరు కూడా ఆ దారిలోనే బోధిస్తే సంవత్సరాంతానికి సత్ఫలితం కనిపిస్తుంది. మీ ప్రయోగంతో వాళ్ళ ముందు నవ్వులపాలయ్యారు. పైగా ఒకరోజు అనవసరంగా నష్టపోయారు."

నాకు మా ప్రధానోపాధ్యాయుని మీద జాలి కలిగింది. నేనన్నాను– "దెబ్బలు కొట్టి చదివించేపని అందరూ చేస్తూనే వున్నారు. దాని ఫలితమే ఇవాళ చూస్తున్నాము. పిల్లలు మొరటుగానూ, అమర్యాదగానూ ప్రవర్తిస్తున్నారు. అల్లరి పిల్లలయిపోయారు. హద్దుమీరిపోయారు, కొరకరాని కొయ్యలుగా తయారయ్యారు. ఈ నాలుగు సంవత్సరాలలో వీళ్ళు 'హే–హే 'హూ,హూ అని కేకలు వేయడం, చప్పట్లు కొట్టడమే నేర్చుకున్నట్లుగా కన్పిస్తుంది. వాళ్ళకు పాఠశాల మీద ప్రేమ లేదు. సెలవు పేరు వినగానే ఎగురుతూ దుముకుతూ పరుగుతీశారు".

"అయితే ఇప్పుడు మీరు ఏమి సాధిస్తారో చూస్తాం గదా!" అన్నాడు ప్రధానోపాధ్యాయుడు.

నేను కూడా మరింత పట్టుదలతో నెమ్మదిగా ఇంటికి చేరుకున్నాను. ఆలోచిస్తూ పడుకొన్నాను. "నేను చేయబోయే పని చాలా కష్టమైనది. ఇది నాకు నిజంగా ఒక పరీక్ష అనే చెప్పాలి. అయినా నాకేమి చింతలేదు. అధైర్యపడకూడదు. ఎక్కడైనా శాంతి ఆట ఇలా వుంటుందా? మాంటిస్సోరి పద్ధతిలో

"దెబ్బలు కొట్టి చదివించేపని అందరూ చేస్తూనే వున్నారు. దాని ఫలితమే ఇవాళ చూస్తున్నాము. పిల్లలు మొరటుగానూ, అమర్యాద గానూ ప్రవర్తిస్తున్నారు. అల్లరి పిల్లలయిపోయారు. హద్దు మీరిపోయారు, కొరకరాని కొయ్యలుగా తయారయ్యారు. ఈ నాలుగు సంవత్సరాలలో వీళ్ళు 'హే–హే 'హూ,హూ అని కేకలు వేయడం, చప్పట్లు కొట్టడమే నేర్చుకున్నట్లుగా కన్పిస్తుంది. వాళ్ళకు పాఠశాల మీద ప్రేమ లేదు. సెలవు పేరు వినగానే ఎగురుతూ దుముకుతూ పరుగుతీశారు".

దీనికోసం ముందుగానే ఎంతో శిక్షణ ఇవ్వబడుతుంది. వచ్చీ రావడంతోనే శాంతి ఆట ప్రారంభించి నేను కూడా కొంచెం తెలివి తక్కువ పనే చేశాను. నేను వాళ్ళను పరిచయం చేసుకోవాలి. పరిచయాన్ని పెంచుకోవాలి. వాళ్ళ ప్రేమను పొందాలి. వాళ్ళకు అభిరుచిని కలిగించాలి అప్పుడే వాళ్ళు నేను చెప్పినట్లు వింటారు. నేను చెప్పినట్లు చేస్తారు. బడికన్న సెలవంటేనే ఎక్కువగా ఇష్టం వున్న చోట పని చేయడమంటే అర్థం భగీరథ ప్రయత్నమే."

మరుసటి రోజు చేయవలసిన కార్యక్రమాన్ని నిశ్చయించుకొని ఆ తరువాత నిద్రపోయాను. నా కార్యక్రమాన్ని గురించిన కలలతోనే ఆరాత్రి గడచిపోయింది.

పాఠశాల ప్రారంభమయింది. నేను క్లాసులోకి వెళ్ళాను. పిల్లలు నాచుట్టూచేరి నిలబడ్డారు. ఆనందంగా ఉన్నారు. ఉత్సాహంగా ఉన్నారు. పరిహాసంగా అడిగారు. "మాస్టరు గారూ, ఈ రోజు కూడా సెలవు ఇవ్వరూ? ఈ రోజుకూడా సెలవు, సెలవు, సెలవు!"

నేను సరేనన్నాను "అయితే యీరోజంతా సెలవు యివ్వను. రెండు గంటలు మాత్రమే. ముందుగా నేనొక కథ చెపుతాను వినండి. తరువాత వేరే విషయాలు మాట్లాడుకుందాం".

నేను వెంటనే కథ ప్రారంభించాను.

"అనగా అనగా ఒక రాజు. ఆరాజుకు ఏడుగురు రాణులువున్నారు, ఏడుగురికీ ఏడుగురు రాకుమారులు, ఏడుగురికీ ఏడుగురు రాకుమార్తెలు!"

పిల్లలందరూ గోలగా, గలిబిలిగా, గందరగోళంగా అరుస్తూ వచ్చి నాచుట్టూ కూర్చున్నారు. నేను కథ చెపుతూ చెపుతూ మధ్యలో ఆపి వాళ్ళతో అన్నాను – "చూడండి అందరూ సరీగా కూర్చోండి. ఇలా అయితే కుదరదు."

అందరూ కొంచెం కుదురుగానే కూర్చున్నారు. అయితే "తొందరగా చెప్పండీ, తొందరగా చెప్పండీ, తరువాత ఏమయిందండీ, ఆ తరువాత ఏమయిందండీ!" అంటూ అదే పనిగా ప్రశ్నిస్తున్నారు.

నేను చిరునవ్వు నవ్వుతూ కథ ప్రారంభించాను.

"ఏడుగురు రాకుమార్తెలకు ఏడేడు రాజభవనాలు, ప్రతి భవనానికీ ఏడేడు ముత్యాల పందిళ్ళు!"

పిల్లలు కళ్ళప్పగించి కథ వింటూ కూచున్నారు. క్లాసంతా నిశ్శబ్దంగా వుంది. ఒక్కరు కూడా నోరెత్తడం లేదు. "ఈ క్లాసులో ఇంత ప్రశాంతత ఎలా ఏర్పడిందా!" అని ప్రధానోపాధ్యయుడు ఆలోచించి వుంటాడు. ఆయన హఠాత్తుగా నాక్లాసులోకి ఊడిపడ్డాడు. "చెప్పండి, చెప్పండి, కథ చెపుతున్నారా?" అన్నాడు.

"అవునండీ, కథ చెపుతున్నాను. ఇది కొత్తరకం శాంతి ఆట. రెండూ తోడు తోడుగా నడుస్తున్నాయి." అన్నాను నేను.

ప్రధానోపాధ్యాయుడు వెనక్కి తిరిగి వెళ్ళి పోయాడు. నాకథ కొనసాగుతూనే వుంది. ప్రక్కనున్న క్లాసులన్నీ గందరగోళంగా వున్నాయి. అప్పుడు నేనన్నాను – "ప్రక్క క్లాసుల్లో ఎంత గందరగోళం జరుగుతున్నదో చూడండి!" పిల్లలందరూ ఆ గందరగోళం పట్ల తమ నిరసన భావాన్ని తెలియజేశారు.

కథ సగం పూర్తయింది. అప్పుడు అందరినీ అడిగాను.– "అబ్బాయిలూ సెలవు కావాలా? కావాలంటే కథ ఆపివేస్తాను. కథ కావాలంటే కొనసాగిస్తాను."

అందరూ ఒక్కసారిగా అరిచారు – "కథ చెప్పండి, కథ చెప్పండి. మాకు కథే కావాలి సెలవు అక్కర్లేదు."

"అయితే మంచిదే! కథవినండి, మధ్యలో కొంచెం పిచ్చాపాటి మాట్లాడుకుందాం. ఆ తరువాత గంట కొట్టే వరకూ కథ చెపుతాను." అన్నాను నేను.

ఒక కుర్రవాడు అన్నాడు– "మధ్యలో మాటలెందుకండీ, అవి రేపు చెప్పుకుందాం. త్వరగా కథ చెప్పండి, కథసాంతం అయిపోవాలి."

"కథ అప్పుడే యెక్కడ అయిపోతుంది? ఈకథ ఇంకా నాలుగు రోజులకు కూడా పూర్తి కాదు." అన్నాను నేను.

అందరూ– "ఒహో, అంత పెద్ద కథా? అయితే బలే మజాగా ఉంటుంది."

నేను జేబులోనుంచి రిజిష్టరు తీశాను. పిల్లల పేర్లు వ్రాసుకోవడం ప్రారంభించాను. అందరూ చకచకా, టకటకా వచ్చి పేర్లు వ్రాయించుకున్నారు. నేను హాజరు తీసుకున్నాను. "చూడండీ, ఇక నుంచి నేను రోజూ కథ ప్రారంభించే ముందే హాజరు తీసుకుంటాను. ఆ తరువాతనే కథ చెపుతాను". అని చెప్పి కథ ప్రారంభించాను. గంట కొట్టే వరకు కథ సాగుతూనే వుంది.

గంట కొట్టినా పిల్లలు కదలడం లేదు. "కాసేపు కూర్చొండి, కథ చెప్పండీ!" అంటున్నారు.

"ఈ రోజు ఇంతవరకు చాలు, మళ్ళీ రేపు" అని నచ్చచెప్పి వాళ్ళందరిని అడిగాను "రేపు సెలవు కావాలా? కథ కావాలా?"

"మాకు కథ కావాలి, కథే కావాలి!" అంటూ అందరూ ఇళ్ళకి వెళ్ళిపోయారు.

నిన్నటి సెలవు, సెలవు, సెలవు, అనే శబ్దాలకు బదులు నేటి వాతావరణంలో కథ,కథ,కథ అనే శబ్దాలు ప్రతిధ్వనించాయి.

నేను ఆలోచించాను– "నిన్నటి నష్టం ఈ రోజు పూడ్చుకో గలిగాను. కథ ఒక అద్భుతమైన ఇంద్రజాలం అనే మాట అక్షరాలా నిజం!"

**(గిజుభాయి గుజరాత్ విద్యావేత్త. ఆయన రచన 'పగటి కల' నుంచి ఈ వ్యాసం. తెలుగు అనువాదం: పోలు శేషగిరిరావు)**

## 'నదీమ తల్లి'

**ఎక్కడో? ఎప్పుడో...**
**ఊహకి అందని ఎత్తులో...**
**కొండల్లో కోనల్లో... ఊటగామారి**
**చూపుకి అందక**
**చేతికి చిక్కక**
**క్రిందకు జారి**
**నెమ్మదిగా నడకనేర్చింది**
**వాగుల్తో, వంకల్తో**
**చెట్టా పట్టాలేసుకుని**
**మైదాన ప్రాంతాల్లో,**
**ఉరకతో ఉత్సాహంగా పరుగులు తీసింది**
**సమస్త జీవకోటికి జీవధార అయ్యింది**
**పరవళ్ళతో సంగీతాన్ని నేర్పి**
**వరవడితో మానవాళికి మహత్తర శక్తినిచ్చింది.**
**అవరోధాలెన్నింటినో అధిగమించి నిత్యచైతన్యంతో**
**పరుగులిడుతూనే ఉంది.**
**సాగర సంగమం కోసం ఉరకలెత్తుతూనే ఉంది**
**గమ్యం చేరే వరకూ ఉద్యమిస్తూనే ఉంది.**
**ఏ ప్రాంతంలో ఏ పేరుతో పిలిచినా**
**రూపంలేని తాను**
**ఉన్నంతలో ఒదిగిపోతూనే**
**ఒద్దికగా లక్ష్యం వైపు దూసుకుపోతుంది.**
**దూషణ భూషణల కతీతంగా**
**చరిస్తూనే ఉంది! చలిస్తూనే ఉంది!!**

**-ఆర్. దుర్గాప్రసన్న**

# సగటు మనిషి ఆవేదన

- పసుపులేటి రమాదేవి

ఆడవాళ్ళు సమన్యాయం పొందాలి అంటే ఈ వ్యవస్థలో మార్పు వచ్చినప్పుడే అది సాధ్యమవుతుంది. మన ఆలోచనావిధానంలో మార్పు రావాలి. ముఖ్యంగా పిల్లలను పెంచే విధానంలో శాస్త్రీయపరమైన ఆలోచనావిధానంలో ఆలోచించగలగాలి. అలాంటి ఆలోచనలు మచ్చుకైనా రాని విధంగా ఉన్నది మన చుట్టూ వున్న వాతావరణం.

అది ఎలా? అంటే. ఎంతో ఆదర్శభావాలతో తీసిన సినిమాలలో కూడా కొన్ని పాటలు వింటుంటే ఆవేదన కలుగుతుంది. ఉదా: ''బలిపీఠం'' సినిమాలో హీరో ఎంతో అభ్యుదయంగా హీరోయిన్ని పెళ్ళి చేసుకుంటాడు. కాని ఒక పాటలో 'అబ్బాయిపుడితేను ఎలాగా?' అని భార్య పాడితే 'గొప్పవాణ్ని చేయాలి ఇలాగా' అని, 'అమ్మాయి పుడితే ఎలాగా?' అని పాడితే 'పెళ్ళి చేసి పంపాలి ఇలాగా' అని అంటాడు. అంటే ఇలాంటి వ్యత్యాసంతో కూడిన ఆలోచనలు మన బుర్రలో బాగా నిండిపోయాయి. ''మీనా'' సినిమాలో 'మల్లె తీగవంటిది మగువ జీవితం చల్లని పందిరి వుంటే అల్లుకుపోయేను' అని పాడుతూ, ఆడవాళ్ళకి చిన్న వయస్సులో తండ్రి లాలన, పెళ్ళి అయినాక భర్త తోడు, వృద్ధాప్యంలో పిల్లల ఆదరణ అవసరం అని చెబుతూ వచ్చారు. అంటే ఎప్పుడూ ఎవరో ఒకరి ఆదరణ, దయాదాక్షిణ్యాల మీద బతకాల్సిందే తప్ప, వాళ్ళకి ఒక గుర్తింపు వుండకూడదా? మరొక సినిమాలో ''ఇల్లే ఇలలో స్వర్గమని ఇల్లాలే ఇంటికి దేవతని రుజువు చేసావు నువు రుజువు చేసావు'' అంటూ ఒక పాట ఆడవాళ్ళను మన వ్యవస్థలో దేవతలుగానే పూజిస్తారు తప్ప, మననున్న మనుషులుగా వాళ్ళని గుర్తించటంలేదు. (దేవతలను పూజించటం అంటే పండగలకి చేసిన పిండి వంటలు కొత్త బట్టలు, బంగారు నగలు కొన్నప్పుడు కూడా దేవలతముందు కాసేపు వుంచి తరువాత వాటిని భుజిస్తారు, నగలు బట్టలు ధరిస్తారు. అదే దేవతలు మనము పెట్టినవన్ని తినివేయటం, నగలు బట్టలు వాళ్ళే ధరించటం మొదలు పెడితే అసలు ఏవీ వాళ్ళ ముందు పెట్టరు.) కాబట్టి మనం కోరుకునది. దేవతులుగా పూజించవద్దు ఆరాధించవద్దు. ఆడవాళ్ళను మనసు ఉన్న మనుషులుగా గుర్తించి, వారి ఆలోచనలను గౌరవించగలగాలి.

నాకు తెలిసిన ఒక అమ్మాయి ఆలోచన అంటే ఆ అమ్మాయి కూడా కొంతమేరకు అభ్యుదయంగానే ఆలోచించే అమ్మాయే అయినా తను ఎదుర్కొంటున్న సమస్యలతోటి విసిగిపోయి అలాగే ప్రస్తుతము ఆడవాళ్ళమీద వయస్సుతో నిమిత్తం లేకుండా జరుగుతున్న అత్యాచారాలు, దాడులు అన్నీ చూసి 'అసలు ఆడ పిల్లలను కనాలి అంటే భయం వేస్తుంది' అని చెప్పింది వాస్తవానికి ఆ అమ్మాయికి ఇంకా పెళ్ళి కూడా కాలేదు. పెళ్ళి కాక ముందే ఆడపిల్లని కనాలి అంటే భయం అనే భావన ఎందుకు వచ్చింది అంటే ఆ అమ్మాయికి తండ్రి లేదు. పెద్దగా ఆస్తి పాస్తులులేవు. తల్లి, ఒక తమ్ముడు ఉన్నారు. ఆ అమ్మాయి ఉన్నత చదువులు పూర్తయి జాబ్ చేస్తుంది. పెళ్ళి చేసుకుందాము అంటే అవతలి వారు మొట్టమొదట పెట్టే కండిషన్ పెళ్ళి అయినాక మీ అమ్మ, తమ్ముడు బాధ్యతలు నీవు పెట్టుకోకూడదు. అంటే మరి వారిని ఎవరు చూడాలి?

స్త్రీని ఒక వస్తువులాగ, ఆస్తిలాగా చూస్తున్నారే తప్ప వేరొకటి కాదు. ఆమె మీదనే కాకుండా ఆమె సంపాదన మీద కూడా సర్వ హక్కులు భర్తవే అనే భావన బాగా నాటుకుపోయింది.

ఈ మధ్యన ఒక ఆవిడ తోటి సంభాషణ జరిగినది. ఆవిడకి దాదాపు వయస్సు 60 సం॥లు పైనే ఉంటాయి. చూడటానికి అ డ్వాన్స్‌డ్‌గా వుంది. కాని ఆమె ఆలోచనలు ఎలా వున్నాయి అంటే ఆడ పిల్లల ఇంటికి ఆడపిల్లల తల్లిదండ్రులు వెళ్ళకూడదు. అది అల్లుడిల్లు, అల్లుడు ఇంట్లో వుండకూడదు. అనే బలమైన ఆలోచనతో వుంది. ఇప్పుడు కొంతమంది అభ్యుదయంగా ఆలోచించే వాళ్ళు అబ్బాయి అయినా, అమ్మాయి అయినా ఒకటే అనే ఆలోచనలతోటి ఇద్దరూ ఆడపిల్లలే అయినా ఇక పిల్లలు వద్దూ అనుకొని ఆయిద్దరినే మంది ఆలోచనల తోటి వ్యక్తిత్వం, బాధ్యత గల అమ్మాయిలుగా వాళ్ళ కాళ్ళ మీద వాళ్ళు నిలబడి ఇంకా కొంతమందిలని పోషించే హోదాగల ఉద్యోగంలో వున్నా సరే ఆ ఆడపిల్లలు వాళ్ళ తల్లి దండ్రుల గురించి ఆలోచించకూడదు. వారి బాగోగులు చూడకూడదు. చాలామంది అబ్బాయిల ఆలోచనలు కూడా ఇలాగే వున్నాయి. అబ్బాయిలు ఎంత సేపూ మా పేరెంట్స్ ఓల్డ్ అయిపోతారు కదా, మరి వాళ్ళను కూడా చూసుకునే బాధ్యత నా భార్యకి వుంటుంది అని ఆలోచించలేకపోతున్నారు. అంటే ఒకసారి పెళ్ళి చేసిన తరువాత ఆ అమ్మాయి సంపాదించేవి కూడా మావే, అంటే భర్త, భర్త తరపు అత్త, మామలకే సర్వహక్కులూ అనే ఆలోచనలోనే వుంటున్నారు.

వివాహ విషయంలో కన్యాదానం అనే కార్యక్రమంలో అల్లుడికి కాళ్ళు కడిగి పిల్ల తండ్రి బిడ్డను దానం చేయటం అంటే అర్ధం అదే అని ఆపాదించుకొని అదే ఆలోచనలతో చిన్నప్పటిననుండి పిల్లలను పెంచుతున్నారు. అలాగే పెరుగుతున్నారు. వెనకటికి బాల్యవివాహాలు, అంటే చిన్నప్పుడే (రసజ్వల) కూడా కాకముందే పెళ్ళిళ్ళు చేసి కన్యాదానం చేసి అప్పగింతలు చేసేవారు. బహుశ చిన్న పిల్ల కాబట్టి జాగ్రత్తగా చూచుకోమని పిల్లకు తెలిసి తెలియని వయస్సు కాబట్టి అలాగ చేసే వారేమో! మరి ఇప్పుడు ఎందుకండ్డీ ఆ తంతులు అన్నీ ఇప్పుడు అమ్మాయి పెరిగి పెద్దయి బాగా చదువుకుని, తన కాళ్ళమీద తాను నిలబడి తనను తాను పోషించుకోవడమే కాకుండా ఇతర కుటుంబ సభ్యులను కూడా పోషించే పరిస్థితిలో వున్నప్పుడు ఆ కన్యాదానం ఏమిటి? ఆ అప్పగింతల అవసరమేముంది? కాబట్టి మారుతున్న కాలం, పరిస్థితులతో పాటు వివాహ విధానంలో కూడా మార్పులు రావాలి.

అసలు పిల్లలను చిన్నప్పటి నుండి మనము ఎలాగ పెంచితే అలాగే పెరుగుతారు. ఈ మధ్యన వచ్చిన "రుద్రమ దేవి" సినిమాలో మనకు ఆ విషయం చాలా స్పష్టముగా కనపడింది. ఆ సినిమాలో ఆడపిల్లలకి రాజ్యాధికారం చేసే అధికారం వుండదు కాబట్టి పుట్టింది అమ్మాయి అని ఎవరికి తెలియకుండా ఆ అమ్మాయిని ఒక అబ్బాయి లాగా అంటే రుద్రమ దేవిని, రుద్రమదేవుడు లాగా పెంచి అన్ని విద్యలు నేర్పిస్తారు. ఎంతో వీరోచితంగా యుద్ధాలు కూడా చేయగలుగుతుంది.

ఆడపిల్లలను చిన్నప్పటి నుండి కొన్ని కట్టుబాట్ల తోటి నువ్వు ఆడపిల్లవు నువ్వు ఆ పని చేయలేవు. బయటికి వెళ్ళకూడదు అని అంటుంటారు. అమ్మాయికి 12 సం॥ల వయస్సు వచ్చినప్పటి నుండి ఇంకా ఎక్కువ ఆంక్షలు పెడుతుంటారు. కనీసం పెద్దగా నవ్వితే కూడా ఏంటి ఆ నవ్వు మొగరాయుడి లాగా అని, తలపైకెత్తి నడుస్తుంటే ఏంటి ఆ నడవడం మొగరాయుడి లాగా నడవడం ఆడపిల్లవు తలవంచుకొని ఒద్దికగా నడవాలి అంటుంటారు. అబ్బాయిలు చిన్నప్పుడు కాని కొంచెం పెద్ద అయిన తరువాత కాని ఎవరైనా ఏడిస్తే 'ఏంటిరా ఆ ఆడంగి ఏడుపు అంటారు. చిన్నప్పటి నుండి మనకు తెలియకుండానే వారి మనసులో ఏడవడం ఆడవాళ్ళ పని అని అబ్బాయి తలపైకి ఎత్తుకుని నేను ఏదైనా చేయగలను ఏమి చేసినా తప్పులేదు అని వారి బుర్రలో పెడుతున్నది మనమే.

**స్త్రీని ఒక వస్తువులాగ, ఆస్తిలాగా చూస్తున్నారే తప్ప వేరొకటి కాదు. ఆమె మీదనేకాకుండా ఆమె సంపాదన మీద కూడా సర్వ హక్కులు భర్తవే అనే భావన బాగా నాటుకుపోయింది.**

**'మల్లె తీగవంటిది మగువ జీవితం చల్లని పందిరి వుంటే అల్లుకుపోయేను' అని పాడుతూ, ఆడవాళ్ళకి చిన్న వయస్సులో తండ్రి లాలన, పెళ్ళి అయినాక భర్త తోడు, వృద్ధాప్యంలో పిల్లల ఆదరణ అవసరం అని చెబుతూ వచ్చారు. అంటే ఎప్పుడూ ఎవరో ఒకరి ఆదరణ, దయాదాక్షిణ్యాల మీద బతకాల్సిందే తప్ప, వాళ్ళకి ఒక గుర్తింపు వుండకూడదా?**

ఒక ఇంట్లో ఒక కొడుకు ఒక కూతురు ఉంటే ఇద్దరికి ఆహారం పెట్టే విషయంలో, చదివించే వివషయంలోనూ వ్యత్యాసం చూపిస్తున్నాము. అలాగే తిన్న తర్వాత ఆడపిల్ల చిన్నది అయినా అన్నయ్య పళ్ళెం కూడా ఆ అమ్మాయితో తీయంచడం చేస్తారు. అలా కాకుండా, చెల్లి చిన్నది. చెల్లి కంచం కూడా నువ్వే తీసి క్లీన్ చేయి అని అబ్బాయి తోటి ఎందుకు చేయించలేకపోతున్నామో ఒకసారి ఆలోచించుకోవాలి.

ఈ మధ్యన ఒక ఇంటికి వెళ్ళినప్పుడు ఆ అమ్మాయి చాలా చక్కగా వుంది. 'ఏం చదువుకున్నావు?' అని అడిగితే ఎమ్ టెక్ అయిపోయింది అని చెప్పింది. 'ఏమ్మా మరి జాబ్ కోసం సర్చింగ్‌లో వున్నావా?' అని అడిగితే ఆ అమ్మాయి ఏమీ మాట్లాడలేదు. వాళ్ళ అమ్మ లేదండి వాళ్ళ నాన్నగారు వద్దన్నారు. ఒక సంవత్సరము కాలేజీలో ఫ్యాకల్టీగా చేసింది. మాన్పించేసారు. ఎందుకుంటే పెళ్ళి చేయాలి అనుకుంటు న్నాము ఇప్పటి నుండి కష్టపడటం ఎందుకు, రేపు పెళ్ళయ్యాక వాళ్ళు ఉద్యోగం చేయిస్తారో లేదో వారి ఇష్టం. అయినా వాళ్ళ నాన్నకు పాప జాబ్ చేయడం ఇష్టం లేదు అనే సమాధానం చెప్పింది. అంటే చదువుకున్న ఆ అమ్మాయి ఏంచేయాలో జాబ్ చేయాలా లేదా అనేది పెళ్ళి చేసాక వాళ్ళు చెయ్యమంటే చెయ్యాలి లేకపోతే లేదు అని వాళ్ళ నాన్న నిర్ణయిస్తాడు తప్ప ఆ అమ్మాయి నిర్ణయంతో పని లేదు.

ఆడపిల్లల పెంపకంలో మార్పు రావాలి. ఆడ, మగ అనే తేడా లేకుండా సమానంగా పెంచాలి. వాళ్ళ జీవితానికి సంబంధించిన నిర్ణయాలు వాళ్ళు తీసుకుని ధైర్యంగా చెప్పగలిగేలా, వాళ్ళ వ్యక్తిత్వాలను వాళ్ళు నిలుపుకునేలా ఆడపిల్లలు తయారు కావాలి.



# ఉజ్వల భారతి కెప్టెన్ లక్ష్మీ సెహగల్

**(జులై 23 కెప్టెన్ లక్ష్మి సెహగల్ 4వ వర్ధంతి సందర్భంగా)**



**భా**రత జాతీయ సైన్యపు చరిత్రలో 1943 అక్టోబరు 21వ తేదీ సువర్ణాక్షరాలతో లిఖించవలసిన రోజు. ఆ రోజు సాయంకాలం 4.30 గంటలకు సింగపూర్ కథే సినిమా హాలు ప్రాంగణంలో, కిక్కిరిసిన ప్రజాసమూహం మధ్య స్వతంత్ర భారత తాత్కాలిక ప్రభుత్వం ఏర్పాట యిందనీ నేతాజీ సుభాస్ చంద్రబోస్ ప్రకటించారు. నేతాజీ ప్రభుత్వ అధిపతిగా ప్రమాణ స్వీకారం చేసారు. స్వతంత్ర భారత తాత్కాలిక ప్రభుత్వంలో, తొలి మహిళా సంక్షేమ మంత్రిగా డా॥ లక్ష్మీ స్వామినాథన్ ప్రమాణ స్వీకారం చేశారు. ఝాన్సీరాణి రెజిమెంటుకు ఆమె అధినేత్రి అయ్యారు. ఈ ప్రభుత్వాన్ని 9 దేశాలు భారత ప్రభుత్వంగా గుర్తించాయి. అక్టోబరు 23వ తేదీ రాత్రి నేతాజీ మంత్రులందరితో మంత్రిమండలి సమావేశం ఏర్పాటు చేశారు.

ప్రపంచ చరిత్రలో, మహిళా పోలీసులు, మహిళా సిపాయిలు ఉండవచ్చు కాని స్త్రీలలో, ఒక రెజిమెంటుని నిర్మించటం, ఐ.ఎన్.ఎ కు ముందు ఎక్కడా జరగలేదు. అది ఒక నేతాజీ, కెప్టెన్ లక్ష్మీ సెహగల్ గార్లకే సాధ్యమయింది. సైన్యంలో స్త్రీలు అన్న భావనే ఆనాటికీ అంగీకరించలేక పోయారు. స్త్రీల పాత్ర చారిత్రక అవసరం అని నేతాజీ ఉద్బోధించారు.

సింగపూర్‌లో భారత మహిళలు తోటలలో వెట్టి చాకిరీ చేసేవారు. 1500 మంది సైనిక శిక్షణ పొందారు. ఝాన్సీరాణి రెజిమెంటులో 1000 మంది సర్వ సన్నద్ధులుగా యుద్ధభూమిలో నిలిచారు. 200 మంది నర్సులుగా సేవలందించారు. స్త్రీలు లేనప్పుడు వారి పిల్లలను చూసు కొనడానికి వారి భర్తలు అంగీకరించారు. సైన్యంలో చేరిన పురుషులు ఇంటిపనులు, వంట పనులు కూడా చేసేవారు. కొన్ని కుటుంబాలకు కుటుంబాలే సైన్యంలో ఉండేవి. స్త్రీలను గౌరవించాలి అనేది సైన్యంలో నేతాజీది ముఖ్యమైన ప్రబోధం.

**లక్ష్మి సెహగల్ బాల్యం, చదువు, స్వాతంత్రోద్యమం :** బాల్యంలో లక్ష్మీ గార్కి పుస్తక పఠనం, గుర్రపు స్వారీ, ఈత, టెన్నిస్‌లో ప్రవేశం ఉంది. ప్రముఖ న్యాయవాది. ఎస్. స్వామినాధన్, స్వాతంత్ర్య సమర యోధురాలు, సామాజిక కార్యకర్త. ఎవి అమ్ముకుట్టి దంపతులకు 1914 సెప్టెంబరు 24వ తేదీన లక్ష్మి జన్మించారు. అమ్ముకుట్టి కేరళకు చెందిన నాయర్ కుటుంబానికి చెందిన వారు. స్వామినాధన్ పాలక్కడ్‌కు చెందిన బ్రాహ్మణుడు. పాలక్కడ్ జిల్లాలోని అనకార గ్రామంలో నివసిస్తున్న లక్ష్మిగారి అమ్మమ్మ ఎ.వి. లక్ష్మికుట్టిగారి వద్దకు లక్ష్మి వెళ్తుండేది. నాయర్లలోని మాతృస్వామిక జీవితంలోని ధీరత్వం, సామర్థ్యం మూర్తీభవించిన అమ్మమ్మ కార్యకలాపాల్ని లక్ష్మి అబ్బురంగా గమనిస్తుండేవారు. మాతృస్వామికంలో కుటుంబ ఆస్తికి స్త్రీలే హక్కుదారులు. అందుచే లక్ష్మి అమ్మమ్మ చాలా స్వతంత్ర భావాలతో ఉండేది. గ్రంథ పఠనంలో బైబుల్, ఖురాన్‌ల మళయాళ అనువాదాల్ని కూడా చదివేవారు.

లక్ష్మీ మేనమామ గారు గాంధేయవాది. గాంధీజీ స్ఫూర్తితో అమ్ముకుట్టి, అంటరానితనాన్ని వ్యతిరేకించారు. విదేశీ వస్త్ర బహిష్కరణ పిలుపును అనుసరించారు. 1931-32లో జరిగిన భగత్‌సింగ్ విచారణ యువతపై ఎనలేని ప్రభావాన్ని చూపించింది. ఆ సందర్భంగా భగత్‌సింగ్‌కు మద్దతు తెలుపుతూ, లక్ష్మి విద్యార్థుల సమావేశాలు జరిపేది. హర్తాళ్ళకు నాయకత్వం వహిస్తూ విరాళాలు వసూలు చేసేవారు. 1932వ సం॥లో లక్ష్మి వైద్య కళాశాలలో చేరారు. అక్కడే తొలిసారిగా కమ్యూనిస్టు సిద్ధాంత పరిచయం ఏర్పడింది. సరోజినీ నాయుడు సోదరి సుహాసిని. భారతదేశానికి సరైన రాజకీయ వ్యవస్థ కమ్యూనిజమే అని వాదించేది. కమ్యూనిస్టు ఉద్యమంపైన లక్ష్మి తొలిసారి చదివిన పుస్తకాల్లో ఎడ్గార్‌స్నో రచించిన చైనాపై అరుణతార గ్రంథం ముఖ్యమైంది. డాక్టరు చదువు పూర్తయిన చివరి సం॥లో లక్ష్మి టాటా ఎయిర్‌వేస్ పైలెట్‌ను వివాహం చేసుకున్నారు. అతను నాభావాలకు వ్యతిరేకం అయి పైగా నాపై తనదే పూర్తి అధికారం అని నియంతగా ఉండేవాడు (లక్ష్మిగారి మాటలలో). సింగపూర్‌లో బ్రిటీష్ సైన్యం మహిళా వైద్యుల్ని

చేర్చుకుంటున్నదని తెలిసిన లక్ష్మి 1940లో అక్కడికి వెళ్ళారు. సింగపూర్ చేరాక అక్కడ కేరళకు చెందిన ఒక వైద్య స్నేహితుని హాస్పటల్‌లో డాక్టరుగా పనిచేయటం ప్రారంభించారు. అప్పటికి లక్ష్మికి 26 సం॥ల వయసు. సింగపూర్ వెళ్ళాక 3 సం॥లకు నేతాజీతో సమావేశం అయ్యారు. 5,6 గంటలు నేతాజీతో సుధీర్ఘ సమావేశం లక్ష్మిగారి జీవితాన్నే పూర్తిగా మార్చివేసింది.

రంగూన్ (బర్మా)లో రెండవ రెజిమెంట్ శాఖను కూడా ఏర్పాటు చేసారు. అంతా బెంగాలీ మాట్లాడే స్త్రీలు. కార్యకర్తల శిక్షణా శిబిరాలు, పరిపాలనా బాధ్యతలు మొత్తంగా లక్ష్మీ చూసేవారు, అన్ని ముఖ్యాం శాలలోనూ, ఐ.ఎన్.ఏ అధికారుల మధ్య జరిగే చర్చలలో లక్ష్మి పాలుపంచుకొనేవారు. నేతాజీ విదేశీ ప్రతినిధి బృందాన్ని కల్సుకునే సందర్భాలలో లక్ష్మి కూడా ఆయనతోనే ఉండేవారు.

1945 మే నెలలో బ్రిటీష్ సైనికులు అటవీ ప్రాంతాన కెప్టెన్ లక్ష్మిగార్ని అరెస్టు చేసారు. మొదటి నెలలో ఆమెను గృహ నిర్బంధంలో ఉంచారు. అక్కడ ఐ.ఎన్.ఏ కు చెందిన ఒక సిక్కు కుటుంబానికి మందుల దుకాణమున్నది. అక్కడినుండి లక్ష్మి వైద్య సేవలందించారు. 1945 అక్టోబరు 21న రంగూన్‌లో ఐ.ఎన్.ఏ సిపాయిలు, మద్దతుదార్లతో కూడిన పెద్ద సమావేశం జరిగింది. ఆ సభకు పలువురు భారతీయ జర్నలిస్టులు హాజరయ్యారు. వారు పంపిన వార్తల ద్వారానే ఐ.ఎన్.ఏ విశేషాలు భారత ప్రజలకు తెలిసాయి. దానితో ఆందోళన చెందిన బ్రిటీష్ ప్రభుత్వం బర్మా కొండ ప్రాంతానికి లక్ష్మి గారిని మార్చింది. 1945 అక్టోబరు నుండి 46 మార్చి వరకూ లక్ష్మి అక్కడే ఉన్నారు. అనంతరం లక్ష్మిగారిని విచారణ కొరకు భారత్‌కు తరలించారు.

1945 నవంబరు 5వ తేదీ నుండి డిశెంబరు 31 వరకు విచారణ సాగింది. 30 సం॥ల తర్వాత తాను త్యజించిన లాయరు కోటును ధరించి జవహర్‌లాల్ నెహ్రూ కోర్టుకి వచ్చారు. ముద్దాయి తరపున వాదించటానికి, విషయసేకరణకు, రెడ్‌ఫోర్టులో ఉన్న పౌరుల్ని కలిసారు. నేతాజీ దూరదృష్టి వలన, అజాద్ హింద్ ఫౌజ్‌కి, యుద్ధ ఖైదీల స్థాయి వచ్చింది.

ఐ.ఎన్.ఏ కేసులోని ముఖ్యులలో ఒకరైన కల్నల్ ప్రేమ్ కుమార్ సెహగల్‌ని కెప్టెన్ లక్ష్మీ 1947 మార్చిలోవివాహం చేసుకున్నారు. లాహోరు నుండి లక్ష్మి దంపతులు కాన్పూరు చేరారు. లక్ష్మీ సెహగల్ వెంటనే తన వైద్యవృత్తిని ప్రారంభించారు. పాకిస్థాన్ నుండి వలస వచ్చిన కాందిశీకులకు హిందూ, ముస్లిం తేడా లేకుండా కెప్టెన లక్ష్మి పునరావాసాలు కల్పించారు. మతపరమైన ద్వేషాలు చెలరేగిన ఆ కాలంలో ముస్లిం రోగులకు వైద్యం చేసిన ఏకైక డాక్టరు కెప్టెన్ లక్ష్మీ. లక్ష్మి, ప్రేమ్ దంపతులకు ఇద్దరు కుమార్తెలు. సుభాషిణి, అనీష. కెప్టెన్ లక్ష్మి తన వైద్యసేవలన్నీ పేదవర్గాలు, కార్మికులకే అందించారు. కాన్పూర్‌లోని పత్తి మిల్లుల కార్మికులే అధికశాతం ఉండేవారు. అట్లే వైద్యశాల సిబ్బందిలో ఎక్కువమంది, లాహోరు నుండి వచ్చిన శరణార్ధులే ఉండేవారు.

బాంగ్లా దేశ్ యుద్ధ సమయంలో పశ్చిమ బెంగాల్‌లో ఏర్పాటు చేసిన శరణార్ధుల శిబిరాల్లో సేవ చేయుటకు, డాక్టర్లు మందులు, బట్టలు కావాలని పత్రికలలో ప్రకటించారు. ఆ ప్రకటన చదివి స్పందించిన కెప్టెన్ లక్ష్మి గారు వెంటనే మందులు, బట్టలు తీసుకొని వెళ్ళి సరిహద్దు ప్రాంతాలలో అహోరాత్రులు విరామం లేని సేవలందించారు. ఒకసారి బంగ్లాదేశ్ సరిహద్దుల్లోకి ప్రవేశించి ముక్తివాహిని కార్యకర్తల్ని ఉద్దేశించి కూడా ప్రసంగించారు.

కెప్టెన్ లక్ష్మీ సెహగల్, విభిన్న సామాజిక- ఆర్థిక నేపథ్యాల నుండి వచ్చిన మహిళల సాధక, బాధకాలు పరిశీలించేవారు. ఆమె ఎప్పటి నుండో జాతీయస్థాయిలో ఒక మహిళా సంఘం ఏర్పాటు చేయాలని నొక్కి చెప్తుండేవారు.

1981వ సం॥లో అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం ఏర్పడినప్పుడు లక్ష్మీసెహగల్ దానికి ఉపాధ్యక్షురాలైనారు. 1984లో ప్రధాని ఇందిరాగాంధీ హత్యానంతరం పలు ప్రాంతాలలో సిక్కులపై దాడులు, హింసాకాండ చెలరేగింది. కాని కెప్టెన్ గారి ఆసుపత్రి ఉన్న ప్రాంతంలో నివసిస్తున్న సిక్కులపై, వారి ఇళ్ళు, దుకాణాలపై గాని, ఎలాంటి దౌర్జన్యమూ

ప్రపంచ చరిత్రలో, మహిళా పోలీసులు, మహిళా సిపాయిలు ఉండవచ్చు కాని స్త్రీలలో, ఒక రెజిమెంటుని నిర్మించటం, ఐ.ఎన్.ఏకు ముందు ఎక్కడా జరగలేదు. అది ఒక నేతాజీ, కెప్టెన్ లక్ష్మీ సెహగల్ గార్లకే సాధ్యమయింది. సైన్యంలో స్త్రీలు అన్న భావనే ఆనాటికీ అంగీకరించలేకపోయారు. స్త్రీల పాత్ర చారిత్రక అవసరం అని నేతాజీ ఉద్భోదించారు.

సింగపూర్‌లో భారత మహిళలు తోటలలో వెట్టి చాకిరీ చేసేవారు. 1500 మంది సైనిక శిక్షణ పొందారు. ఝాన్సీరాణి రెజిమెంటులో 1000 మంది సర్వ సన్నద్ధులుగా యుద్ధభూమిలో నిలిచారు. 200 మంది నర్సులుగా సేవలందించారు. స్త్రీలు లేనప్పుడు వారి పిల్లలను చూసుకొనడానికి వారి భర్తలు అంగీకరించారు. సైన్యంలో చేరిన పురుషులు ఇంటిపనులు, వంట పనులు కూడా చేసేవారు. కొన్ని కుటుంబాలకు కుటుంబాలే సైన్యంలో ఉండేవి. స్త్రీలను గౌరవించాలి అనేది సైన్యంలో నేతాజీది ముఖ్యమైన ప్రభోదం.

జరగలేదు. లక్ష్మిగారు వీధుల్లో తిరుగుతూ సిక్కులపై దాడులకు సిద్ధమైన మూకల్ని అడ్డుకొని అదుపు చేయటమే అందుకు కారణం. అదే ఏడాది భోపాల్‌లో యూనియన్ కార్బైడ్ ఫాక్టరీలో విషవాయువు విడుదలై వేలాది ప్రజలు మరణించారు. లక్ష్మీ సెహగల్ వెంటనే ఒక వైద్యబృందాన్ని తీస్కొని వెళ్ళి అక్కడ బాధితులకు వైద్య సహాయం అందించారు. అనంతరం గర్భిణీ స్త్రీలపైన విషవాయువు వల్ల దీర్ఘకాలంలో ఏర్పడే దుష్ఫరిణామాలపై ఒక నివేదికను ప్రభుత్వానికి సమర్పించారు.

1980వ దశకంలో, విజయవాడలో మహిళా సంఘం కేంద్రకమిటీ సమావేశాల సందర్భంగా కెపెన్ లక్ష్మిగారిని ప॥గోదావరి జిల్లాకు ఆహ్వానించి పాలకొల్లులో మహిళా సంఘం పెద్ద బహిరంగ సభ ఏర్పాటు చేసాము. ఆ సభలో కెప్టెన్ లక్ష్మీ సెహగల్ గార్కి గార్డ్ ఆఫ్ ఆనర్ ఇచ్చి, మహిళా సంఘం పేరుతో పెద్ద క్రాస్ బెల్ట్ వేసి జిల్లా అధ్యక్షురాలు ప్రభావతితో సన్మానం చేయించాము. ఆ సందర్భం ఎంతో అద్భుతంగా జరిగింది.

మా అమ్మాయి కాన్పూర్‌లో ఉన్న 7 సం॥లు అక్కడ కార్మిక వాడల్లో, స్లమ్ ఏరియాల్లో చాలా దూరం సైకిలుమీద వెళ్ళి ఉద్యమానికి సేవ చేసిందని, లక్ష్మిగారు పరమానందపడేవారు. వారు వేసిన బాటలలో, శక్తివంతమైన ప్రజాఉద్యమాలు నిర్మిస్తూ మరో స్వతంత్రోద్యమానికి మనం సన్నద్ధం కావాలనేదే కెప్టెన్ లక్ష్మీ సెహగల్ గారి చివరి సందేశం.

ఐద్వా కేంద్ర కమిటీ సమావేశం **1998 సెప్టెంబర్ 7,8 తేదీలలో ఉదయం 11 గంటలకు :** కలకత్తా సాల్ట్ లేక్ స్టేడియంలో కెప్టెన్ లక్ష్మీ సెహగల్ జెండా ప్రతిష్టాపన చేస్తూ ఇచ్చిన అపురూపమైన సందేశం "తన్ మన్ ధన్ సమర్పణ్ కర్‌కే, హమ్ సబ్ లోగ్, హమారా బచ్చోం కేలియే, లడ్ నాచాయియే, కామ్‌కర్ నా చాయియే". తనువు, మనస్సు, ధనము సమర్పణ (త్యాగం) చేసి, మన బిడ్డలకోసం పోరాటం చేయాలి. పనిచేయాలి. (సంఘంలో పని చేయాలి) .

**సేకరణ :** ఆ మీటింగ్‌లో నేను వ్రాసుకున్న మినిట్స్ నుండి.

**- అల్లూరి మన్మోహిని, మాజీ ఉపాధ్యక్షురాలు ఏపి ఐద్వా.**

# అమ్మాయిలూ.. జరజాగ్రత్త.. సదస్సు



అనంతపురం సదస్సులో మాట్లాడుతున్న ఐద్వా రాష్ట్ర ప్రధాన కార్యదర్శి రమాదేవి

సోషల్ మీడియా ద్వారా స్నేహితులుగా మారి, ప్రేమ పేరుతో వంచించే వారి పట్ల అమ్మాయిలు, మహిళలు జాగ్రత్తగా ఉండాలని వక్తలు పిలుపునిచ్చారు. ఐద్వా, ఎస్‌ఎఫ్‌ఐ సంయుక్త ఆధ్వర్యంలో శుక్రవారం అనంతపురం జిల్లా కేంద్రంలోని లలిత కళా పరిషత్‌లో 'అమ్మాయిలూ.. జర జాగ్రత్త' అన్న అంశంపై సదస్సు నిర్వహించారు. ఐద్వా జిల్లా కార్యదర్శి వి.సావిత్రమ్మ, ఎస్‌ఎఫ్‌ఐ జిల్లా కార్యదర్శి రమేష్ అధ్యక్షతన నిర్వహించిన

## సోషల్ మీడియా స్నేహాలతో జాగ్రత్త

సదస్సులో ఎస్పి రాజశేఖర్‌బాబు, ఐద్వా రాష్ట్ర కార్యదర్శి రమాదేవి, సినిమా డైరెక్టర్ బాబ్జి ప్రసంగించారు. గ్రామీణ ప్రాంతాల నుంచి చదువు కోసం నగరానికి వచ్చే అమ్మాయిలు అబ్బాయిల చేతిలో మోసపోతున్నారని చెప్పారు. గతంతో పోలిస్తే చదువుకుంటున్న అమ్మాయిల సంఖ్య పెరిగిందన్నారు. ఈ మార్పు నేపథ్యంలో ఎదురవుతున్న సవాళ్లను అమ్మాయిలు చాకచక్యంగా అధిగమించాలని సూచించారు. సాంకేతిక పరిజ్ఞానాన్ని, సామాజిక మాధ్యమాలను విజ్ఞానాన్ని పెంపొందిచుకోవడానికి స్ఫూర్తి కలిగించే ఆలోచనలను పంచుకోవడానికి ఉపయోగించాలే తప్ప కాలక్షేపం కోసం కాదన్నారు. నిష్పక్షపాతంగా పోరాడుతున్న ఐద్వా నాయకులను ఎస్పి అభినందించారు. సినీ ప్రపంచంలో లాభాల కోసం ప్రేమను వస్తువుగా పెట్టి సినిమాలు తీస్తున్నారని, వాటిని నిజమని నమ్మి జీవితమంటే ప్రేమ ఒక్కటేనని భ్రమపడరాదన్నారు. అమ్మాయిలు శక్తి వంతులుగా ఎదిగి అన్ని రంగాలలో అభివృద్ధి సాధించాలన్నారు.

అవగాహన సందర్భం

# ఇళ్ళు, మానసిక పరివర్తనా కేంద్రాలు

- డా॥ శిలాలోలిత

**రేపటి తరానికి స్త్రీ, పురుషుల, సమాన స్థితిని తెల్సుకునేట్లుగా పెంచాలి. చిన్నచిన్న అవసరాలకు, ఆధార పడటం కాకుండా ఆర్థిక స్వావలంబనకు కృషిచేయాలి. తమ అభిప్రాయాలకు విలువనిచ్చే స్థితిని నెలకొల్పుకోగలగాలి. మాటల యుద్ధాల ద్వారా, చిన్నచిన్న పోరాటాల ద్వారా, సంయమనంతో సంచరిస్తూ, కుటుంబాలు విచ్ఛిన్నం కాకుండానే, మానసిక పరివర్తనా కేంద్రాలుగా ఇళ్ళను తయారు చేయాలి. ఒక విధంగా చెప్పాలంటే, స్త్రీలు మాత్రమే విజయాన్ని సాధించగలరు. వారి విజయానికి చేయూతను పురుషులిచ్చినప్పుడు మాత్రమే స్త్రీల పని సులువవుతుంది. స్త్రీపురుషులు ఇరువురూ పరస్పర అవగాహనతో వ్యవహరించినప్పుడు మాత్రమే ఈ అంతరాలు తొలగిపోతాయి.**

ఒకప్పటి కంటే స్త్రీలు ఎంతో అభ్యున్నతి సాధించారని, మహిళా సాధికారికత లభించింది అనే మాటలు వింటుంటాం. పెదాల మీద వ్యంగ్యపు చిరునవ్వే కనబడుతుందప్పుడు. స్త్రీలు సాధించిన విజయాలేమిటి? అని ప్రశ్నించుకుంటే, అన్నీ ప్రశ్నార్థకాలే. స్త్రీలిప్పుడు ఇళ్ళనే యుద్ధభూముల్లో ఉన్నారు. సమాజంలోని అసమానతల శిబిరాల్లో ఉన్నారు. కత్తులు, కటార్లుతో పాటు, హింసలకు గురవుతున్న కాలమిది. మానసిక ప్రపంచ కవాటాలు తెరుచుకుని, శక్తిని సమీకరించుకొని, తమలోతాము, తమతో తాము, ప్రపంచంతో యుద్ధం చేస్తున్న కాలమిది. అంతర్ బహిర్ పోరాటాలే స్త్రీల స్థితిని మెరుగుపర్చ డానికి తోడ్పడుతున్నాయి. వ్యక్తి చైతన్యం ప్రధానమైందిపుడు. ఇన్నాళ్ళలాగా 'నిమ్మకు నీరెత్తినట్లు' ఉంటే లాభం లేదన్న వాస్తవాన్ని గ్రహించారు. ఎవరో ఎవరెవరో చెప్పిన మాటల్ని నమ్మేస్థితిలో లేరు. ఇంకెవరో స్వేచ్ఛనిచ్చేస్తా మన్నా వాస్తవాల్ని అంచనా వేసే స్థితికి వచ్చేసారు. 'పోరాడితేపోయేదేం లేదు సంకెళ్ళు తప్ప' అనే నిజాన్ని తెలుసుకున్నారు. తమకు స్వయం సిద్ధులు కావాలన్న నిర్ణయాలకు వచ్చారు. ఆత్మాభిమానంతో, ఆత్మగౌరవ పోరాటాలతో తమ యుద్ధాన్ని తాము మొదలుపెట్టే సైనికులుగా తయారయ్యారు. 20,30 శాతం వరకు మాత్రమే ఇలాంటి స్థితికి చేరుకోగలిగారు. తామే నేరం చేయలేదనీ, తాము ఎవరి కంటే కూడా తక్కువ కాదనీ, తాము అనుకున్నది సాధించేవరకూ ఆగేది లేదన్న నిర్ణయ ప్రకటనలు చేసుకోగలగాలి. ఇల్లే కేంద్రం, కుటుంబమే సమాజం. 'ఇంటగెలిచి రచ్చ గెలవాలన్నట్లు'గా ముందు ఇంట్లోనే జెండర్ వివక్షను లేకుండా చేసుకోగలగాలి. కన్న పిల్లల్ని పెంచే క్రమంలో ఈ వివక్ష లేకుండా చూసుకోవాలి. రేపటి తరానికి స్త్రీ పురుషుల, సమాన స్థితిని తెల్సుకునేట్లుగా పెంచాలి. చిన్నచిన్న అవసరాలకు, ఆధార పడటం కాకుండా ఆర్థిక స్వావలంబనకు కృషిచేయాలి. తమ అభిప్రాయాలకు విలువనిచ్చే స్థితిని నెలకొల్పుకోగలగాలి. మాటల యుద్ధాల ద్వారా, చిన్నచిన్న పోరాటాల ద్వారా, సంయమనంతో సంచరిస్తూ, కుటుంబాలు విచ్ఛిన్నం కాకుండానే, మానసిక పరివర్తనా కేంద్రాలుగా ఇళ్ళను తయారు చేయాలి. ఒక విధంగా చెప్పాలంటే, స్త్రీలు మాత్రమే విజయాన్ని సాధించగలరు. వారి విజయానికి చేయూతను పురుషులిచ్చినప్పుడు మాత్రమే స్త్రీల పని సులువవుతుంది. స్త్రీ, పురుషులు ఇరువురూ పరస్పర అవగాహనతో వ్యవహరించినప్పుడు మాత్రమే ఈ అంతరాలు తొలగిపోతాయి. ఒక్కొక్క ఇటుకతో ఇంటి నిర్మాణాన్ని చేసినట్లు, ఒక్కొక్క అభిప్రాయాలు, ఆలోచనల పరిశ్రమతో కొత్త ఇళ్ళు నిర్మించుకోగలగాలి. ఇన్ని తరాలుగా కాంక్రీటు ఇళ్ళుగా, బలంగానిర్మింపబడిన భావజాలాలన్నింటినీ తొలగించడానికి మరింత బలోపేతం కావాల్సిన అవసరమెంతైనా ఉంది. స్త్రీలు బలహీనులుకారు. తక్కువకారు. పురుషునితో పాటు సమానులే. ఇంకా మాట్లాడితే ఎక్కువే. స్త్రీకి మరోప్రాణిని సృష్టించగలిగిన శక్తి వున్నది కనుక ఈఎక్కువ, తక్కువ భేదాల జోలికి పోకుండా సమ ప్రాధాన్యతగల ప్రాణులు అన్న స్పృహ ఏర్పడ్డనాడు ఇన్ని అసమానతలు ఉండవు. గ్రామీణ స్త్రీలలోనూ, విద్యావంతులు కాని వారిలోసైతం ధైర్యమూర్తులనేకులున్నారు. వారి పోరాటపటిమను, ధైర్యాన్ని ఎంతగానో కొనియాడొచ్చు. 'ఏతావాతా' తేలిందేమంటే, ఆత్మగౌరవ పోరాటమిది. దీనికి ధైర్యసాహసాలే నిదర్శనం. ఎవరికి వారు పోరాడే దృక్పథాన్ని అలవర్చుకోగలిగిననాడు సమాజంలో మార్పుని మనం ఊహించవచ్చు. పురుషుల తత్వాలలో, ఆలోచనా దృక్పథంలో మార్పు వచ్చినప్పుడే సమాజం బాగుపడుతుంది. మా తరంలో మార్పును కొంత మేరకు తీసుకురాగలిగాం. కానీ ఇటీవలి కాలాన్ని గమనించినప్పుడు, స్త్రీలపై పెచ్చు పెరిగిన హింసారూపాలు గమనించినప్పుడు విషాదమన్పిస్తోంది. ప్రపంచీకరణ నేపథ్యం వల్ల, మారిన సామాజిక స్థితుల్ని చూసినప్పుడు మనం మరింతగా జాగ్రత్త వహించాల్సిన సందర్భమిది. మానసిక పరివర్తనా శాలలుగా ఇళ్ళుతయారయినప్పుడే సమాజం మారుతుందనిపిస్తోంది. ●●

కేస్ స్టడీ

# నా భర్తని నాకిప్పించండి మేడమ్

- కె. శారద

25 సంవత్సరాల వయసున్న మహిళ ఇద్దరు పిల్లలతో ఐద్వా లీగల్ సెల్‌కి వచ్చింది. ఆవెను కూర్చోమని నెమ్మదిగా ఏం జరిగిందని అడిగారు బాధ్యులు. 'అమ్మా! నా పేరు లలిత. మాకు పెళ్ళై ఐదేళ్ళయింది. ఇద్దరు ఆడపిల్లలు. నా భర్త అనంత్ పెయింటర్. ఎక్కడ పని ఉంటే అక్కడకు వెళ్ళి పనిచేస్తాడు. గుంటూరు, సత్తెనపల్లి, తెనాలి, ఖమ్మం అన్ని ఊళ్ళూ తిరుగుతాడు. విపరీతంగా తాగుతాడు. ఖైని, గుట్కా లాంటివన్నీ అలవాటయ్యాయి. డబ్బులు బాగానే సంపాదిస్తాడు. నాకు ఇస్తాడు. నేను నా భర్త కూడా 10వ తరగతి వరకు చదివాము' అంది. 'అయితే ఇపుడు సమస్య ఏమిటమ్మా!' అని అడిగాము.

'నా భర్త 6 నెలలుగా గుంటూరులో పని చేస్తున్నాడు. అసలు ఇంటికి రావడంలేదు. డబ్బులు ఇవ్వడంలేదు. నేను ఫోన్ చేసినా తియ్యడు. ఎవరో అమ్మాయితో కలసి ఉంటున్నాడని తెలిసింది. ఆమె నా ఫోన్‌కు చాలా అసభ్యమైన మాటలు, మెసేజ్‌లు పెట్టడం చేస్తుంది. ఈ మధ్య నా బంగారం కుదువ బెట్టాడు. డబ్బంతా ఆమెకే ఇచ్చాడు. ఆమె నుండి నాభర్తను రప్పించి నా దగ్గర ఉండేలా చెయ్యండి మేడమ్! ఇదిగో కావాలంటే ఈ మెసేజ్‌లు చూడండి' అని అవన్నీ చూపించింది.

ఆమె భర్తను, అతనితో ఉన్న ఆమెను తీసుకుని కుటుంబ న్యాయసలహా కేంద్రానికి రమ్మని లెటర్ పంపారు బాధ్యులు. తరువాత వారం ఆ అబ్బాయి వచ్చాడు. 'నా పేరు అనంత్. నన్ను రమ్మన్నారు ఎందుకు?' అని అడిగాడు. అనంత్ సన్నగా గాలి వీస్తే పడిపోయేలా చాలా బలహీనంగా ఉన్నాడు. 'ఏమిటి నువ్వు ఇలా ఉన్నావు? బాగా తాగుతావా?' అని అడిగారు ఐద్వా బాధ్యులు. కొంచెం తాగుతాను అన్నాడు. ఎందుకు తాగడం? ఆరోగ్యం చెడిపోతుంది కదా!' అని చెబితే 'నేను చాలా కష్టమైన పని చెయ్యాలి మేడమ్! రాత్రి కొంచెం తాగితే మర్నాడు పనిలోకి వెళ్ళడానికి ఓపిక వస్తుంది'అన్నాడు. మరి ఈ అమ్మాయి సంగతేమిటని అడిగితే నిజమేనమ్మా నేను తప్పు చేశాను. ఆరు నెలల నుండి ఆమెతో కలిసి ఉన్నాను. రెండు నెలల నుండి అక్కడకు పోవడం లేదు'అన్నాడు. ఎందుకలా చేశావంటే 'నా భార్య నన్ను ఇంటికి రానివ్వదు. మా ఇల్లు మా అత్తగారింటికి దగ్గరగానే ఉంటుంది. ఎప్పుడూ అక్కడే ఉంటుంది. నేను వచ్చి రమ్మన్నా రాదు. అక్కడే వుంటానంటుంది. మరి నేనేం చెయ్యాలి?' అని అడిగాడు. 'ఏమిటమ్మా నిజమేనా?' అని లలితనడిగితే 'నాకు తాగితే అసహ్యంగా ఉంటుంది. ఇష్టం లేదు' అంది. 'నాకు అన్నం కూడా పెట్టదు అమ్మా. అందుకే ఆమె దగ్గరకు వెడతాను. నన్ను బాగా చూసుకుంటుంది' అన్నాడు. 'నువ్వు చేసేది తప్పు. ముందు నీ అలవాట్లు మానెయ్యి. భార్యకు నచ్చజెప్పి ఇంట్లో ఉండేలా చూసుకో. ఇద్దరు పిల్లలున్నారు మీకు వాళ్ళ బాధ్యత లేదా? ఇలా తాగితే నువ్వు ఎన్నాళ్ళుంటావు?' అని బాధ్యులు గట్టిగా అడిగారు. 'అవునమ్మా! నిజమే నాది పొరపాటు. ఇంకముందు ఇలాంటి పని చెయ్యను' అన్నాడు. 'నీ భార్య నీలాగే ప్రవర్తిస్తే నీకెలా వుంటుంది? నువ్వు భరించగలవా? చెప్పు' అంటే, 'నేనింక ఏ తప్పు చెయ్యను. ఆ అమ్మాయిని వదిలేస్తా' అని అన్నాడు.

ఆ అమ్మాయిని పిలిచాము. ఆమె వచ్చింది. ఆమె పేరు సరళ. ఆమెకు ఇద్దరు పిల్లలున్నారు. 'ఏంటమ్మా భార్యా భర్తల మధ్య వాళ్ళ జీవితంలోకి నువ్వు రావడం ఏమిటి?' అని మందలించాము. అనంత్ భార్య సరిగా పట్టించుకోదు. అందుకే నా దగ్గరకు వస్తాడు' చెప్పింది. 'నువ్వు అలా మాట్లాడకూడదు. ఇంకొకరితో సంబంధం పెట్టుకోకూడదు. ఆ అమ్మాయికి అన్యాయం చెయ్యకూడదు' అని చెప్పారు. నువ్వు అలా మెసేజ్‌లు, అసభ్యకరమైన పదాలు ఫోన్‌లో పెట్టడం తప్పు కదా!' అన్నాము. 'నాకు చదువే రాదు. నేను ఫోన్ ఎలా చేస్తాను?'అంది. 'చదువుకు, సెల్‌ఫోన్ వాడడానికి సంబంధం లేదులే అందరూ వాడుతున్నారు అన్నాము. ఎందుకిలా ఉండటం కష్టపడి పనిచేసుకో' అని చెప్పాము.

'ఏం చెయ్యను అమ్మా! నా మొదటి భర్త చనిపోయాడు. నాకిద్దరు పిల్లలు. రెండవ భర్త నాకన్నా 30 ఏళ్ళు పెద్దవాడు, నన్ను వదిలి ఎటో పోయాడు. నేను గ్లాస్ కంపెనీలో పనిచేస్తాను. నాకు ఏడువేలిస్తారు. అనంత్ ఆ దగ్గరలోనే పెయింట్లు వేసేవాడు. అతనికి నా సామాన్లు ఇచ్చి నా ఇంట్లోనే గది ఇచ్చి సహాయపడినాను. అలా పరిచయమయింది. 6 నెలలు కలిసి ఉన్నాము. ఇపుడు రావడంలేదు'అంది. 'మీరిద్దరూ కలిసి ఉంటే అనంత్ భార్య ఏమవుతుంది? నువ్వు నీకు తోడు కావాలంటే ఏ బాధ్యతలు లేని వాడిని పెళ్ళి చేసుకో. అతనితో హాయిగా ఉండు. వేరొకరి భర్తతో కలిసి ఉండడం తప్పు. మీరిద్దరూ మీ స్వార్థం మాత్రం చూసుకున్నారు. సమాజం, పిల్లలు ఇవేమి ఆలోచించకుండా ఇద్దరూ తప్పు చేశారు. ఇక ముందు వారి జీవితంలోకి రాకు. అనంత్‌ను మర్చిపోయి నీ జీవితం నీ ఇష్టమొచ్చినట్లు జీవించు' లలిత ఫోన్‌కు ఎలాంటి మెసేజ్‌లు ఇక ముందు రాకూడదు' అని లీగల్ సెల్ బాధ్యులు ఒక ఒప్పందం రాశారు. వీటన్నింటికి ఒప్పుకుని సరళ సంతకం చేసింది. అనంత్ కూడా అలాగే చేశాడు.

'నీకు ఒక నెల రోజులు టైమ్ ఇస్తున్నాము. నీ అలవాట్లు అన్నీ మానెయ్యాలి. పిల్లల్ని మంచి స్కూలులో చేర్పించు. భార్యను బాగా చూసుకో. మళ్ళీ వారం మా దగ్గరకు రండి. ఏమైనా గొడవలుంటే మా దగ్గరకు వచ్చి చెప్పండి. మేము పరిష్కరిస్తామన్నాము.

అనంత్, లలిత అన్నిటికీ ఒప్పుకున్నారు. అనంత్‌కి డాక్టర్ గారితో కౌన్సిలింగ్ చేయిస్తామని చెప్పాము. అలాగే అని చెప్పాడు. తప్పకుండా వస్తామని భార్యా భర్తలు పిల్లలతో కలిసి ఆనందంగా ఇంటికి వెళ్ళారు. ●

# నిజాల్ని నిగ్గు తేల్చడమే లక్ష్యం.

- సలీమా



రానా ఆయుబ్. 2002లో తను విద్యార్థిగా ఉన్నపుడు గుజరాత్ నరమేధం ఆమెను కదిలించింది. వేల మంది ముస్లింల ఊచకోతకు కారణమైన వాస్తవాలను వెలికి తీయాలని నిర్ణయించుకుంది. 2010, అప్పుడు ఆమె వయసు 26ఏళ్ళు. తెహల్కాలో జర్నలిస్టుగా పని చేస్తూ స్టింగ్ ఆపరేషన్‌ను ప్రారంభించింది. ఎనిమిది నెలలు తనని తాను కోల్పోయింది... కఠోర శ్రమతో ఎన్నో విలువైన సాక్ష్యాలను బయటకు తెచ్చింది. ఆ వాస్తవాలు తిరస్కరణలకు గురయ్యాయి. తను పడ్డ శ్రమ వృధా కాకూడదని, గుజరాత్ అల్లర్లకు కారణమైన నిజాలు బయటకు తేవాలని తాను సంపాదించిన టేపులతో 'గుజరాత్ ఫైల్స్' పేర తానే స్వయంగా పుస్తకంగా ప్రచురించింది.

స్టింగ్ ఆపరేషన్ అంటేనే కష్టంతో కూడుకున్న పని. మన ఉనికిని కోల్పోవాలి. మొత్తానికి వేరే మనిషిగా మారిపోవాలి. శారీరకంగా ,మానసికంగా ఎంతో ప్రిపేర్ కావాలి. అయినా రానా తను జర్నలిజంలో నేర్చుకున్న విలువలు కాపాడాలంటే ఈ సాహసం చేయక తప్పదనే అభిప్రాయానికి వచ్చింది. గుజరాత్ మారణహోమం నిజాలను నిగ్గుతేల్చడమే ఆమె లక్ష్యం. తన లక్ష్యసాధన కోసం ఎనిమిది నెలలు తన ప్రపంచానికి దూరంగా ఉంది.

విదేశాల నుండి వచ్చిన ఎన్నారై 'మైథిలీ త్యాగి'గా పేరు మార్చుకుంది. అహ్మదాబాద్‌లో నివాసముంటూ తన ఆపరేషన్‌ను ప్రారంభించింది. ప్రముఖులతో పరిచయాలు పెంచుకుంది. చిన్న చిన్నగా రహస్యాలను రాబట్టే ప్రయత్నం చేసింది. వాటన్నింటిని తను రహస్యంగా ఏర్పాటు చేసుకున్న కెమెరాలలో రికార్డు చేసింది.

అసలు రానాకు ఇంతటి సాహసం చేసే తెగింపు ఎక్కడి నుండి వచ్చింది... ఇది తెలుసుకోవాలంటే ఆమె మూలాల్లోకి పోవాల్సిందే. ఆమె సొంత ఊరు ఉత్తర్‌ప్రదేశ్‌లోని అజాంఘడ్. పుట్టి పెరిగింది మాత్రం బొంబాయి. రానా తండ్రి ఆయూబ్. అభ్యుదయ కవి. తండ్రి ప్రభావం ఆమెపై పడింది. ముస్లిం కుటుంబమైనా అబ్బా రానాకు ఎంతో స్వేచ్ఛనిచ్చాడు. చదువులో ఎంతో ప్రోత్సహించాడు. ప్రస్తుతం తను ఇన్వెస్టిగేటివ్ జర్నలిజాన్ని ఎంచుకోవడానికి కారణం తన అబ్బానే. తను చేసే జర్నలిజం ప్రజలకు ఉపయోగపడాలనేది ఆమె అభిప్రాయం.

రానా తన అమ్మీ గురించి చెబుతూ.. "అమ్మ సపోర్ట్ లేకపోతే నేను ఏమీ చేయగలిగేదాన్ని కాదు. ఇంట్లో నాతో ఒక్కపని కూడా చేయించేది కాదు. ఎంత కష్టమైనా తనే చేసుకునేది. నేను చేస్తున్న ప్రతి పనిలో అమ్మీ సహకారం కచ్చితంగా ఉంది. పుస్తకాలు చదివి వినిపించేది. ఉర్దూ, అరబ్బీ నేర్పించేది. వాస్తవానికి అమ్మీ కూడా అబ్బా ద్వారానే స్ఫూర్తి పొందింది. అది ఎలా అంటే అబ్బాతో అమ్మీ షాదీ జరిగినపుడు ఆమెకు 15ఏండ్లు. ఆమె ఏమైనా నేర్చుకుంది అంటే అది అబ్బా దగ్గరే. ఇది అమ్మీనే మాతో చెప్పేది."

స్టింగ్ ఆపరేషన్ సమయంలో "తెలిసిన వాళ్లందరికీ సెలవుల్లో ఉన్నానని చెప్పా, మెయిల్ ద్వారా ఫ్రెండ్స్ అందరికీ ప్రస్తుతం సెలవుల్లో ఉన్నాననీ, ఎటువంటి స్టోరీలు రాయడం లేదనీ నమ్మించా, ఇంట్లో వాళ్లకు మాత్రం కొంత వరకు తెలుసు. ఈ ఎనిమిది నెలల్లో వాళ్ళతో మూడుసార్లు మాత్రమే మాట్లాడాను. అయితే నేను ఎక్కడ ఉన్నాను, ఏం చేస్తున్నానో మాత్రం చెప్పలేదు. అమ్మీ రోజులు లెక్కబెట్టుకుంటూ ఉండేది. తను ఎప్పుడూ ఈ రోజు నా కూతురు బతికుందా లేదా, తనకు ఏం జరుగుతుందో అనే దిగులుతోనే గడిపేది."

స్టింగ్ ఆపరేషన్ సమయంలో "తెలిసిన వాళ్లందరికీ సెలవుల్లో ఉన్నానని చెప్పా, మెయిల్ ద్వారా ఫ్రెండ్స్ అందరికీ ప్రస్తుతం సెలవుల్లో ఉన్నాననీ, ఎటువంటి స్టోరీలు రాయడం లేదనీ నమ్మించా, ఇంట్లో వాళ్లకు మాత్రం కొంత వరకు తెలుసు. ఈ ఎనిమిది నెలల్లో వాళ్ళతో మూడుసార్లు మాత్రమే మాట్లాడాను. అయి నేను ఎక్కడ ఉన్నాను, ఏం చేస్తున్నానో మాత్ర చెప్పలేదు. అమ్మీ రోజులు లెక్కబెట్టుకుంటూ ఉండేది. తను ఎప్పుడూ ఈ రోజు నా కూతురు బతికుందా లేదా, తనకు ఏం జరుగుతుందో అనే దిగులుతోనే గడిపేది."



ఇంతగా కష్టపడి ప్రాణాలకు తెగించి రానా తెచ్చిన టేపులను తెహల్కా మ్యాగ్‌జైన్ వాళ్ళు రాజకీయ ఒత్తిళ్ళతో ప్రచురించడానికి తిరస్కరించారు. తర్వాత ఎందరి దగ్గరికో రానా తన టేపులను ప్రచురించమని తిరిగింది. కానీ ప్రముఖ ఎడిటర్లందరూ తిరస్కరించారు. దాంతో రానా మానసికంగా చాలా ఇబ్బంది పడింది. ప్రస్తుతం సైకాలజిస్టు సాయంతో కోలుకుంది. ఎంత మంది తిరస్కరణకు గురైనా తను బయటకు తెచ్చిన నిజాలు ప్రజలకు తెలియాలని రానా నిర్ణయించుకుంది. అందుకే తన సొంత పబ్లిషింగ్‌లో "గుజరాత్‌ఫైల్స్" అనే పేరుతో పుస్తకాన్ని ప్రచురించింది. ఎవరు కాదన్నా" జర్నలిజంలో నేర్చుకున్న విలువలకే నేను కట్టుబడి ఉంటాను. దానికోసం ఎంత పోరాటమైనా చేస్తాను." అని రానా ధైర్యంగా చెబుతుంది. ఇప్పుడు తన వర్క్ తనకు చాలా హ్యాపీగా, తృప్తిగా ఉందని కూడా చెబుతోంది.

రానా చేసిన సాహసం మాటల్లో చెప్ప రానిది. ఇదంతా ఆమె తన వ్యక్తిగత స్వార్థం కోసం చేయలేదు. దేశభక్తి, సామాజిక ప్రయోజనం ఆమె నరనరాల్లో నిండివుంది. నిజాల్ని నిగ్గుతేల్చాలనే లక్ష్యం ఆమెను ముందుకు నడిపింది. తను వెళ్ళే దారి అత్యంత ప్రమాదమని తెలిసినా ముందుకే వెళ్ళింది. ఎనిమిది నెలల తన కఠోర శ్రమ నీరుగారిపోతుంటే భరించలేకపోయింది. చివరికి తను అనుకున్నది సాధించింది. మతం పేరిట మారణహోమం రేపుతూ మనల్ని ఏలుతున్న పాలకుల గుట్టును రానా రట్టు చేసింది. వాస్తవ జర్నలిజానికి అక్షర చిహ్నంగా నిలిచిన రానా ఆయుబ్ నేటి జర్నలిస్టులకే కాక యువతకూ స్ఫూర్తిదాయకంగా నిలిచింది.

**బట్టల్లో కాదు బుర్రలో మార్పు**

"ఒక పక్క ప్రభుత్వం మహిళా సాధికారత అంటూ ప్రచారం చేస్తున్నారు. మరో పక్క ఆడపిల్లల బట్టల విషయంలో ఆంక్షలు పెడుతున్నారు. ఆడపిల్ల అలాగే ఉండాలి. ఇలాగే ఉండాలంటూ ప్రకటనలు చేస్తున్నారు. ఇది ప్రతి మహిళా ఎదుర్కొంటున్న సమస్య. నిజానికి మార్పు రావాల్సింది వేసుకునే బట్టల్లో కాదు, మనిషి ఆలోచనా విధానంలో. నావరికే చూస్తే ముస్లింని, భారతీయురాలిని, మోడ్రన్‌గా ఉంటాను, కల్చర్‌గా ఉంటాను. అలాగే జర్నలిస్టుగా పని చేస్తున్నా.

ఇందులో తప్పేముంది. అందుకే ముందు మన బుర్రల్లో ఉన్న ఆలోచనలను మార్చుకోవాలి. అలాగే భర్తలను తిట్టేస్తే అదే ఫెమినిజంగా, మహిళా సాధికారతగా కొంతమంది అనుకుంటారు. కానీ ఇది కరెక్టు కాదు. ఈ సమాజంలో స్త్రీ, పురుషులు ఇద్దరూ తమ తమ ప్రత్యేకమైన బాధ్యతలను నిర్వర్తిస్తున్నారు. కాబట్టి నిజమైన మహిళా సాధికారతను సాధించాలంటే స్త్రీ పురుషులు ఇద్దరూ కలిసి పోరాడాలి" అని రానా గట్టిగా చెబుతున్నారు.

ప్రస్తుతం రానా ప్రచురించిన"గుజరాత్ ఫైల్స్" పుస్తకాన్ని ప్రజలు చాలా బాగా రిసీవ్ చేసుకుంటున్నారు. పాలకులు నిజాలను బయటకు రానీయకుండా పత్రికల నోరు నొక్కాలని చూసినా సోషల్ మీడియా రానాకు అండగా నిలిచింది. మే 25న రిలీజ్ అయిన ఈ పుస్తకం రెండు వారాల్లోనే 20వేల పుస్తకాలు అమ్ముడుపోయాయి. అసలు ఇది ఎప్పుడో ఐదు సంవత్సరాల క్రితం జరగాల్సిన పని. ఇప్పుడైనా జరిగినందుకు రానా చాలా సంతోషంగా ఉంది. నిజం గొంతును ఎవరూ నొక్కలేరని మీడియా రెబల్‌స్టార్ రానా నిరూపించారు.

# పంథా మారిన సుదీర్ఘ పోరాటం



సాయుధ దళాల ప్రత్యేక అధికారాల చట్టంపై అలుపెరగని పోరాటం చేస్తున్న ఇరోమ్ షర్మిల తన పోరాట మార్గాన్ని మార్చుకుంటున్నట్లు ఇటీవల ప్రకటించారు. మణిపూర్‌లో భారత సైన్యం చేస్తున్న అత్యాచారాలను నిరసిస్తూ 16 సంవత్సరాలుగా ఆహారం తీసుకోకుండా దీక్ష చేస్తున్న షర్మిల ఎన్నికల్లో పోటీ చేసి చట్టసభలో ఈ చట్టం ఉపసంహరణకు పోరాటం చేస్తానని ప్రకటించారు. ప్రజలకు సంబంధించిన జీవన్మరణ సమస్యపై సుదీర్ఘ కాలం పోరాటం చేసిన ఘనత షర్మిలకు దక్కుతుంది. ఆమె చేసే రెండోదశ పోరాటానికి మహిళా లోకం ఆమె వెన్నంటి ఉంటుందని, పోరాటం విజయవంతం కావాలని ఆశిద్దాం.

వైద్యం

# డెంగ్యు జ్వరం - అవగాహన

- డా॥ఎం. రమాదేవి

రాష్ట్రంలో డెంగ్యూ జ్వరాలు ఎక్కువగా వున్నాయి. డెంగ్యూ జ్వరం పట్ల జాగ్రత్త అవసరమే కానీ భయం అవసరం లేదు. అన్ని జ్వరాలు డెంగ్యూ జ్వరాలు కావు. రక్తకణాలలో ప్లేట్‌లెట్స్ సంఖ్య తగ్గిపోవటం జ్వరాలన్నింటిలో వుంటుంది. దానినే డెంగ్యూగా భయపెట్టి ప్రైవేట్, కార్పొరేట్ ఆసుపత్రులు ప్రజలను దోచుకుంటున్నాయి. అందుకే ఈ జ్వరాల గురించి ఉన్న అపోహలు, భయాలను నివృత్తి చేసే వాస్తవాలను తెలుసుకుందాం.

**డెంగ్యూజ్వరం ఎలా వస్తుంది?**

"ఎడిస్‌ఈజిప్టి" అనే రకం దోమ కుట్టడం వల్ల డెంగ్యు జ్వరం వస్తుంది. ఇది ఎక్కువగా పగటిపూటనే కుడుతుంది. డెంగ్యూ వ్యాధి వున్న రోగిని కుట్టిన ఈ దోమ మరొకరిని కుట్టడం ద్వారా ఒకరినుండి ఇంకొకరికి ఈ వ్యాధి వ్యాప్తి చెందుతుంది. దోమకుట్టిన 4 నుంచి 15రోజుల్లో ఈ వ్యాధి బయటపడుతుంది.

**ఎలా గుర్తించాలి?:-** విపరీతమైన ఒళ్ళునొప్పులు, కంటి వెనుక భాగంలో నొప్పి, విపరీతమైన నీరసం వుంటుంది. రెండు, మూడు రోజుల్లో తగ్గి మళ్ళీ జ్వరం కనిపించడం అనేది డెంగ్యూ ప్రత్యేకత. ఎముక విరిగినపుడు ఎలాంటి నొప్పి ఉంటుందో అలాంటి నొప్పులు వుండటం వల్ల ఈ వ్యాధికి ఎముకలు విరిచే జ్వరం అని పేరొచ్చింది.

**మూడు దశలు:-** మొదటిది సాధారణ డెంగ్యూ జ్వరం. ఇది జలుబు లాంటి లక్షణాలతో మొదలవుతుంది. చాల మందికి ఈ దశలోనే ఆగిపోతుంది. ఇంకా కొంతమందిలో విపరీతమైన జ్వరం, ఒళ్ళునొప్పులు వుండి రెండు మూడు రోజులలో తగ్గిపోతుంది.

**రెండో దశ డెంగ్యూ హెమరేజిక్ ఫీవర్:-** ఇందులో చర్మంపై ఎర్రటి దద్దుర్లు ఏర్పడుతాయి. చిగుళ్ళ నుండి రక్తం కారడం, ముక్కునుండి కూడా రక్తం కారడం, నెలసరి రక్తస్రావం కూడా ఎక్కువగా వుంటుంది. మల విసర్జన సమయంలో రక్తం పడటం, మలం నలుపు రంగులోకి రావడం వంటి లక్షణాలు కనిపిస్తాయి. వీటిలో కొన్నికానీ, అన్నీకాని కనిపించవచ్చు.

**మూడోదశ డెంగ్యూ షాక్‌సిండ్రోమ్:-** ఈ దశ అత్యంత ప్రమాదకరమైన దశ. ఈ దశలో రోగి శరీరం చల్లబడిపోయి, బి.పి తగ్గిపోయి మూత్ర పిండాలు ఎక్కువగా దెబ్బతినే అవకాశాలున్నాయి.

రెండు,మూడు రకాలు మాత్రమే ప్రమాదకరం. అలా ప్రమాదానికి చేరుకునే సంఖ్య దాదాపు తక్కువే. డెంగ్యూజ్వరం సోకిన వారిలో వెయ్యిమందికి ఒకరు ఈ స్థాయికి వెళ్ళవచ్చు. అయితే మరణాల సంఖ్య డెంగ్యూ వ్యాధి గ్రస్తులలో ప్రతి పదివేలకు ఒకటి వుండవచ్చు.

**ప్లేట్లెట్ల వైద్యం - దోపిడీ:-** జ్వరాలన్నింటిలో కూడా ప్లేట్‌లెట్ల సంఖ్య కొంతమేర తగ్గుతుంది. అందుకనే ప్రజలు ఏ జ్వరం సోకినా డెంగ్యూనేమో అని భయపడనవసరం లేదు. ఈ భయాన్ని ప్రైవేటు, కార్పొరేట్ ఆసుపత్రులు అవకాశంగా తీసుకుంటున్నాయి. ప్లేట్‌లెట్ల సంఖ్య 50వేలకు తగ్గినా ప్లేట్‌లెట్ ప్యాకెట్లు ఎక్కించి లక్షలలో దోచుకుంటున్నాయి.

Dengue fever is characterized by: Fever
Rash
Muscle and joint pains






Aedes aegypti mosquito

**ప్లేట్‌లెట్లు ఎప్పుడు ఎక్కించాలి?:-** ప్లేట్‌లెట్ల సంఖ్య 10-15 వేలకు తగ్గితే, లేదా రక్తస్రావ లక్షణాలు కనిపిస్తే మాత్రమే ప్లేట్‌లెట్లు ఎక్కించాలి. లక్షణాలను బట్టి వైద్యం చేస్తే సరిపోతుంది. సాధారణ మందులు, సెలైన్ వైద్యం చాలు. అన్ని సాధారణ ఆసుపత్రులలో కూడా వైద్యం చేయవచ్చు. ప్రత్యేకమైన పరికరాలు గానీ, ప్రత్యేకమైన వసతులు కానీ అవసరం లేదు. ప్రజానీకం భయపడి కార్పొరేట్ ఆసుపత్రులకు పరుగులుతీసి లక్షల రూపాయలు ఖర్చు చేయడం అనవసరం.

**నొప్పి మందులు వాడొద్దు:-** విపరీతమైన ఒళ్ళునొప్పులతో జ్వరం వస్తే వెంటనే బ్రూఫిన్ లాంటి ఒళ్ళు నొప్పులు తగ్గించే మాత్రలు వాడకూడదు. కేవలం పారాసిటమల్ మాత్రవే వాడాలి. నొప్పిమందులు వాడితే ప్లేట్‌లెట్ల సంఖ్య మరింత తగ్గి రక్తస్రావం జరిగే అవకాశం వుంటుంది.

**నివారణ ఎలా?**

డెంగ్యూ వ్యాధికి టీకామందు లేదు.

దోమలు అధిక సంఖ్యలో వృద్ధి కాకుండా, పుట్టిన దోమలు కుట్టకుండా చూసుకోవడమే నివారణ మార్గం.

**దోమలు వృద్ధిచెందకుండా:**

మన ఇంటిలోనూ, ఇంటి పరిసర ప్రాంతాలలోనూ మంచినీటి నిల్వలు లేకుండా చేయడం ద్వారా మాత్రమే దోమలు ఎక్కువ కాకుండా చూడగలము. ఉదాహరణకు ఇంటి లోపల మంచినీరరు ఐదురోజులు మించి నిల్వ ఉంచకూడదు. ఓవర్ హెడ్ ట్యాంకుల్లో వారానికి ఒకసారి నీటిని మార్చుకోవాలి. సాధారణంగా ఇంటి వెలుపల వుండే పనికిరాని, పగిలిపోయిన వస్తువుల్లోనూ, టైర్లలోనూ, సీసాల్లోనూ, కుండీలు, కూజాలు, డబ్బాలలో నీరు నిల్వలేకుండా చూడాలి. పూలకుండీలలో, ఎయిర్‌కూలర్లలో, ఫ్లవర్ వాజులలో, నీటితొట్లలో నీరు నిలువలేకుండా చేయాలి.

**దోమలు కుట్టకుండా:-** ప్రత్యేకంగా పగటి సమయంలో జాగ్రత్తలు తీసుకోవాలి. పొడవాటి చేతుల చొక్కాలు, లాగులు, తొడుక్కోవాలి దోమలు కుట్టకుండా లేపనాలు పూసుకోవాలి. దోమతెరలు ఉపయోగించాలి.

**డ్రైడే:-**

డెంగ్యూ జ్వరాలు వున్న ప్రాంతాలలో వున్న కుటుంబాలు, అపార్టుమెంట్లు వారి ఇళ్ళలోని నీళ్ళను, ఓవర్‌హెడ్ ట్యాంకులోని నీళ్ళను, పూలకుండీలలో మొత్తంగా వారానికి ఒక్కరోజు పారబోసి ఒక గంట ఆరబెట్టి మళ్ళీ నింపుకోవడాన్ని డ్రైడే అంటారు. ఈ పద్ధతి ఏ ఇంటికి ఆ ఇల్లు, లేదా అందరూ కలసి సామూహికంగా పాటిస్తే మరింత మంచిది. దీనివల్ల దోమల పుట్టుక తగ్గుతుంది.

**ప్రభుత్వ భాధ్యత:-**

ప్రజలు ఎన్ని వ్యక్తిగత జాగ్రత్తలు తీసుకున్నప్పటికీ డెంగ్యూనివారణ ప్రధానంగా ప్రభుత్వ బాధ్యత ఎందుకంటే ఇది డ్రైనేజీ- పారిశుధ్య సమస్య ప్రజలు, ప్రభుత్వం, మీడియా, స్వచ్ఛంద సంస్థలు అందరూ ఏకతాటిపై నిలచి పోరాడాల్సిన సమస్య. ●

# క్షీణిస్తున్న లింగ నిష్పత్తి

## వెయ్యిమంది పురుషులకు 898 మందే మహిళలు నూతన అధికార గణాంకాల వెల్లడి

భారతదేశంలో స్త్రీ పురుష నిష్పత్తి గణనీయంగా పడిపోతోందని అధ్యయనాలు రుజువు చేస్తున్నాయి. ప్రతి వెయ్యిమంది పురుషులకు కేవలం 898 మంది మాత్రమే మహిళలు ఉన్నారని నూతనఅధికార గణాంకాలు పేర్కొంటున్నాయి. 2011 జనాభా లెక్కలు ఈ మేరకు ఆందోళనా సంకేతాలు వెలువరించగా 2012, 2013 సంవత్సరాలలో ఈ అంతరం మరింత పెరిగిందని ఆ గణాంకాలు తెలిపాయి. భారత రిజిస్ట్రార్ జనరల్ ఆర్‌జిఐ కార్యాలయం నిర్వహించే పౌర నమోదు వ్యవస్థ (సిఆర్ఎస్) లో అధికారికంగా జనన మరణ డేటా నమోదై ఉంటుంది. జనన మరణాలు అధికార నమోదు దేశవ్యాప్తంగా మెరుగుపడుతోంది. 20133లో 85% పైగా జననాలు నమోదు అయ్యాయని ఆర్‌జిఐ అంచనా వేసింది. 17 రాష్ట్రాలు మొత్తంగా జనన కార్యకలాపాలను నమోదు చేసాయి. కానీ బీహార్, యు.పి వంటి రాష్ట్రాలు మాత్రం చాలా తక్కువగా నమోదుచేసాయి. నమోదు స్థాయి పెరుగుతున్న కొద్దీ లింగ నిష్పత్తి కూడా మెరుగుపడుతోందని ఆశిస్తున్నట్లు సీనియర్ గణాంక అధికారి తెలిపారు. ఎందుకంటే సాధారణంగా ఆడపిల్లలు పుడితే ఆ విషయం నమోదు చేయడానికి ప్రజలు ముందుకురారని అన్నారు. 2011లో ప్రతి వెయ్యిమంది మగపిల్లలకు 910 మంది ఆడపిల్లలు ఉండగా ఇప్పుడు పరిస్థితి చాలా దిగజారింది. 2011లో 910గా ఆ మరుసటి సంవత్సరం 908కి తగ్గిందని, 2013లో అయితే ఏకంగా 898కి పడిపోయిందని తెలిపింది. మణిపూర్, హర్యానాలైతే ఈ విషయంలో చాలా అధ్వానంగా ఉన్నాయని పేర్కొంది. ఈ గణాంకాలు చూస్తుంటే భారతదేశం బిడ్డ పుట్టడానికి ముందే నిర్వహించే లింగ నిర్ధారణ పరీక్షలపై నిషేధం సరిగా పనిచేయడం లేదని సామాజిక కార్యకర్తలు పేర్కొంటున్నారు. అనేకచోట్ల డాక్టర్లలోనే ప్రతిఘటన ఎక్కువ వుందన్నారు. దానితో చట్టం అమలు కాకుండా పోతుందని లింగ నిర్ధారణ అభార్షన్లపై పోరాడుతున్న డా॥ సాబూ జార్జి వ్యాఖ్యానించారు.

# నయా ఉదారవాద కాలంలో శ్రామిక మార్కెట్లు - లైంగిక అసమానతలు

- అర్చనా ప్రసాద్

1990లో 35శాతంగా ఉన్న మహిళల ఉపాధి భాగస్వామ్యం (work participation) 2014 నాటికి 27 శాతానికి దిగజారింది. ఇదే సమయంలో పురుషులు 85 నుండి 80 శాతానికి తగ్గింది. జెండర్ గ్యాప్ ఇదేకాలంలో 50 నుండి 53 శాతానికి పెరిగింది. శ్రామిక మహిళల్లో 93 శాతం మంది తాత్కాలిక కార్మిక సంబంధాలలోనే (informal labour relations) పని చేస్తున్నారు.

నయా ఉదారవాద ప్రపంచీకరణ మూలంగా వచ్చిన సంక్షోభంతో ప్రపంచవ్యాప్తంగా మితవాద రాజకీయ శక్తులు తిరిగి తలెత్తుతున్నాయి. అమెరికాలో ట్రంప్ చేస్తున్న విషప్రచారం దాని రూపమే!

పెట్టుబడికి ఉత్పాదకత, లాభం పెరిగాయి కానీ కార్మికుల నిజవేతనాలు మాత్రం 2008 సంక్షోభం ముందరి స్థాయికి పెరగలేదని ప్రపంచ వేతన నివేదిక రిపోర్టు(Global wage report) 2014-15 వెల్లడించింది. చైనాను మినహాయించిలెక్కిస్తే ప్రపంచవ్యాప్తంగా 2008 - 13 మధ్య నిజవేతనాలు 1.1 శాతం పెరిగాయి. అదే కాలంలో ఉత్పాదకత చాలా వేగంగా పెరిగింది. చైనాతో కలిపినా ప్రపంచ నిజవేతనాల పెరుగుదల కేవలం 2 శాతంగానే ఉంది. కాబట్టి పెట్టుబడికి వస్తున్న లాభంతో పోలిస్తే కార్మికులకు లభించే వేతనాల వాటా తక్కువని నిర్ధారణ అవుతుంది. శ్రామిక మహిళల విషయంలో అది మరింత ఘోరంగా ఉంది.

పురుషులు, స్త్రీల శ్రామికవర్గ భాగస్వామ్యంశాతం (labour force participation rate)తగ్గుతూ వస్తోందని మహిళా ఉపాధిలో ధోరణులు(women at work trends) 2016 పేర్కొంది. మహిళల విషయంలో అది 52.4 నుండి 49.6 శాతానికి తగ్గగా, పురుషులలో 79.9 నుండి 76.6 శాతానికి తగ్గింది. మహిళల శ్రామికవర్గ భాగస్వామ్య రేట్ పురుషుల కంటే తక్కువగా ఉండడం వలన లింగపరమైన అంతరం ఒక్క శాతంగా ఉంది. ప్రపంచ వ్యాప్తంగా ఉపాధి కల్పనలో తాత్కాలిక కార్మికుల నియామకం అధికం కావడం ఇందుకు కారణం.

ప్రపంచమంతటా ఉపాధిలో దోపిడీ అవకాశాలు (velnerability) (క్యాజు వల్, స్వయం ఉపాధి, కంట్రిబ్యూటింగ్ ఫ్యామిలీ వర్కర్స్) పెరుగుతోందని వరల్డ్ ఎంప్లాయ్ మెంట్ అండ్ సోషల్ అవుట్‌లుక్ ట్రెండ్స్ 2016 పేర్కొంది. అభివృద్ధి చెందుతున్న దేశాల్లో ఇది మరింత ఎక్కువ. దక్షిణాసియాలో 73 శాతం కాగా, సబ్ సహారా ఆఫ్రికా దేశాల్లో అది 70 శాతంగా ఉంది.

దక్షిణాసియా, సబ్‌సహారా ఆఫ్రికా దేశాల్లో స్వయం ఉపాధి, గృహకార్మికులు పురుషులకంటే మహిళలే అధికంగా ఉన్నారు. ఈ దేశాల్లో మహిళలకు తక్కువ వేతనాలు చెల్లిస్తున్నారు. అంతేకాక తక్కువ వేతనం చెల్లించే పనుల్లోనే మహిళల్ని నియమిస్తున్నారు. కాబట్టి శ్రామికవర్గ భాగస్వామ్య రేట్ (labour force participation)పెరుగుతోంది. ఒక్క దక్షిణాసియా ప్రాంతంలోనే ఈ అంతరం గత దశాబ్దంలో 4 శాతం ఉంది. భారతదేశంలో ఇది మరింత ఎక్కువ. 1990లో 35శాతంగా ఉన్న మహిళల ఉపాధి భాగస్వామ్యం (work participation) 2014 నాటికి 27 శాతానికి దిగజారింది. ఇదే సమయంలో పురుషులు 85 నుండి 80 శాతానికి తగ్గింది. జెండర్ గ్యాప్ ఇదేకాలంలో 50 నుండి 53 శాతానికి పెరిగింది. శ్రామిక మహిళల్లో 93 శాతం మంది తాత్కాలిక కార్మిక సంబంధాలలోనే (informal labour relations) పని చేస్తున్నారు.

లింగపరమైన అంతరం ఎక్కువగా ఉన్నప్పటికీ అభివృద్ధి చెందిన దేశాల్లో అది క్రమంగా తగ్గుతోందని ఉపాధిలో మహిళలు వర్క్ రిపోర్టు స్పష్టం చేసింది. ఉపాధి స్వభావాన్ని బట్టి ఇది వ్యక్తమవుతుంది. సంపాదనలో జీతం రూపంలో లభించే వేతనము, స్వయం ఉపాధి ద్వారా లభించే ఆదాయం అన్న ఈ రెండు అంశాలను పరిశీలించాలి.

జీతం ద్వారా వేతనం పొందే ప్రాంతాలతో పోలిస్తే స్వయం ఉపాధి ద్వారా ఆదాయం పొందే ప్రాంతాల్లో లింగపరమైన వేతనాల వ్యత్యాసం (gender wage gap) ఎక్కువగా ఉన్నది. అభివృద్ధి చెందిన దేశాల్లో 90 శాతం మంది జీతం ద్వారా వేతనం పొందుతుండగా అభివృద్ధి చెందుతున్న దేశాల్లో స్వయం ఉపాధి ఆదాయం పొందే వారు ఎక్కువగా ఉన్నారు.

ప్రపంచ వ్యాప్తంగా చూస్తే జెండర్ వేజ్ గ్యాప్ 23శాతంగా ఉంది. అంటే పురుషులు పొందుతున్న వేతనంలో స్త్రీలు కేవలం 77 శాతం మాత్రమే పొందుతున్నారన్నమాట. ఇదే ప్రాంతీయంగా చూసినట్లయితే అభివృద్ధి చెందిన దేశాల్లో జెండర్ వేజ్ గ్యాప్ 15 శాతాన్ని మించి ఉండదు. భారత్ జెండర్ వేజ్ గ్యాప్ (26 శాతం) ఆసియాలో అతి ఎక్కువ.

జెండర్ వేజ్‌గ్యాప్ శ్రామిక సంబంధాలను బట్టి కూడా ఉంటుంది. దీర్ఘకాలిక తాత్కాలిక కార్మిక సంబంధాలు (formal, informal labour relations) అభివృద్ధి చెందిన దేశాల్లో ఇన్‌ఫార్మల్ ఉపాధిలో 12 శాతం కంటే తక్కువ మంది మాత్రమే ఉండగా అభివృద్ధి చెందుతున్న దేశాల్లో దాదాపు 46 శాతం మంది శ్రామికులున్నారు. ఇన్‌ఫార్మల్ ఉపాధిలో ఆసియా వాటా అత్యధికం కాగా అందులో మూడింట రెండు వంతులు దక్షిణాసియా దేశాలనుండి కావడం గమనార్హం. ఇన్‌ఫార్మల్ ఉపాధిని దక్షిణాసియాలో 72 శాతం మంది పొందుతుండగా భారత్‌లో అది 83 శాతంగా ఉంది. భారతీయ మహిళా శ్రామికులలో 90 శాతం మంది ఇన్‌ఫార్మల్ ఉపాధి పొందుతున్న శ్రామికులు. జెండర్ వేజ్ గ్యాప్ ఇంతలా ఉండడం మూలంగా సామాజిక, సాంస్కృతిక వైఖరుల్లోను, వేతనాల నిర్ణయంలోను, మరింత తేడా పెంచుతుంది. స్వయం ఉపాధిలో కూడా ప్రతిఫలం లభించని భాగం భారత్ లాంటి దేశాల్లో ఎక్కువగానే ఉంటుంది. అందువల్ల జెండర్ వేజ్‌గ్యాప్ ఇంకా పెరుగుతుంది.

కాబట్టి లేబర్ మార్కెట్ మాత్రమే జెండర్ వేజ్‌గ్యాప్‌ను నిర్ణయించదు. వివిధ అంశాలను ముఖ్యంగా ఇన్‌ఫార్మలైజేషన్ విధానాన్ని పరిశీలించాలి. ఈ నేపథ్యంలో స్టార్టప్ ఇండియా, స్టాండప్ ఇండియా వంటి నినాదాలతో ఉపాధి కల్పిస్తామన్న ఎన్డీయే ప్రభుత్వ విధానాల ద్వారా శ్రామిక మహిళలకు ఒరిగేది ఏమీ ఉండదు సరికదా కొన్ని ప్రతికూల ఫలితాలు కూడా రావచ్చు.

లైంగిక అసమానతల గురించి పరిశీలించినపుడు ప్రస్తుతం సాగుతున్న కార్మిక సంస్కరణల ప్రభావాన్ని తప్పక గమనంలోకి తీసుకోవాలి. కనీస వేతన చట్టాన్ని, సమాన పనికి సమాన వేతనం చట్టాన్ని నీరుగార్చడం ఇంకా ఇతర కార్మిక చట్టాల సవరణల మూలంగా తక్కువ వేతనానికి ఎక్కువ పని చేసేలా శ్రామికుల మధ్య పోటీ పెరుగుతుంది. పొట్టకూటికోసం ఒక ప్రాంతం నుండి వేరొక ప్రాంతానికి వలస పోయే శ్రామికుల సంఖ్య పెరుగుతున్న కొద్దీ ఇది మరింత తీవ్రమవుతుంది. ఇలాంటి నేపథ్యంలో శ్రామిక మహిళలు మరింత ప్రతికూల పరిస్థితులు ఎదుర్కొంటారు. ఎక్కువ కాలం పాటు పని చేయడానికి, దూర ప్రాంతాలు ప్రయాణించడానికి ప్రస్తుత సామాజిక, సాంస్కృతిక వ్యవస్థలో పరిమితులు ఉన్నాయి.

కాబట్టి జెండర్ వేజ్ గ్యాప్‌ను కేవలం ఒక ఆర్థిక సమస్యగానే చూసి లేబర్ మార్కెట్‌ను నియంత్రించడం ద్వారా సరిచేయడం సాధ్యం కాదు. సామాజిక వ్యవస్థను, కుటుంబంలో శ్రమ విభజనను మార్పు చేయడం ద్వారానే కొంతవరకు పరిష్కరించగలము. కనుక పురుషాధిక్య సామాజిక వ్యవస్థలు, లేబర్ మార్కెట్ మధ్య గల అంతః సంబంధాన్ని అర్థం చేసుకుని వాటికను గుణమైన రీతిలో శ్రామిక వర్గపోరాటాలు ప్రపంచ వ్యాప్తంగా సాగాలి.

– అనువాదం బి.తులసీదాస్

# రామన్ మెగసెసె అవార్డు ఎంపికైన బెజవాడ విల్సన్‌కు అభినందనలు



సఫాయి కర్మచారి ఆందోళన్ జాతీయ కన్వీనర్ బెజవాడ విల్సన్ గారికి ఈ ఏడాది రమాన్ మెగసెసె అవార్డుకు ఎంపికైన సందర్భంగా వారికి ఐద్వా, చైతన్య మానవి అభినందనలు తెలుపుతోంది. మానవ మలాన్ని తోటి మానవుల చేతనే ఎత్తివేసే అమానవీయ పనిని అంతం చెయ్యాలని కంకణం కట్టుకుని 80వ దశకం నుండి అఖిలభారత స్థాయిలో కృషి చేస్తున్నారు. బెజవాడ విల్సన్‌గారు.

2003డిశంబర్3వ తేదీన సుప్రీం కోర్టు ఈ వృత్తిని అంతం చెయ్యాలని ఆదేశాలిచ్చింది. అయినప్పటికీ అది అమలుకు నోచుకోలేదు. దళితుల ఆత్మ గౌరవ దినం నాడు సఫాయి కర్మచారి ఆందోళన్ మరియు దళిత, ప్రజాసంఘాల ఆధ్వర్యంలో "డ్రై లెట్రిన్లు కూల్చేద్దాం, మనవత్వాన్ని కాపాడుదాం"అనే నినాదంతో ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర వ్యాప్తంగా ఉద్యమాన్ని చేపట్టింది.

అధికారిక లెక్కల్లో చాలా తక్కువ మంది మాత్రమే ఈ వృత్తిని చేస్తున్నట్లు చెబుతున్నా ఇంకా 3,00,000మంది ఈ వృత్తిలో ఉన్నట్లు సర్వేలు తెలుపుతున్నాయి. అమానుషమైన ఈ వృత్తి అంతమయ్యేవరకూ పోరాడవలసిందే.

చట్టాలు

# లీగల్ సర్వీసెస్ అథారిటీస్ చట్టం 1987

**ఈ చట్టం ప్రకారం ఆర్థికంగా బలహీనులైన వారికి, ముఖ్యంగా స్త్రీలు, బడుగువర్గాల వారికి ఉచిత న్యాయ సహాయం అందించబడుతుంది. మనదేశంలో ఏ ఒక్కరూ కూడా ఆర్థిక స్తోమతలేని కారణంగా న్యాయస్థానాన్ని ఆశ్రయించలేక పోయామని బాధపడకుండా వుండడానికి, ప్రతి ఒక్కరూ న్యాయస్థానాన్ని ఆశ్రయించే హక్కును పొందడానికీ ఈ చట్టాన్ని రూపొందించడం జరిగింది.**

- ఆర్.దుర్గాప్రసన్న, అడ్వకేట్

ఆర్థిక స్వేచ్ఛ, విద్యా అంతంత మాత్రంగా గల మనదేశ స్త్రీలు చట్టాలు ఎన్ని ఉన్నా, చట్టపరంగా హక్కులను కలిగివున్నా వాటిని అందిపుచ్చు కోవడమెలా? చట్టపరంగా స్త్రీలు తమ హక్కులను సాధించుకోవాలంటే చట్టాల్లో ఏముందో తెలుసుకోవాలి. వాటి సాధనకు న్యాయస్థానాలను ఆశ్రయించాలి.

అంటే ఇవన్నీ ఖర్చుతోనూ, అక్షర జ్ఞానంతోనూ ముడిపడి వున్నాయి కదా! ఎలా? అనే ప్రశ్న అందరికీ కలిగేదే? అంతే కాదు ఎవరైనా తమకు జరిగిన అన్యాయాన్ని న్యాయస్థానానికి వివరించేముందు ప్రతివ్యక్తీ న్యాయ నిబంధనల ప్రకారం కొంత మొత్తాన్ని కోర్టు ఫీజు రూపంలో వసూలు చేస్తుంది. అంతేకాక న్యాయ వాదుల సేవలను పొందడానికీ కొంత పైకం చెల్లించవలసి వుంటుంది. ఆర్థిక స్వేచ్ఛనే సాధించలేని మన స్త్రీలకు ఇది సాధ్యమేనా? ఆదాయ వనరులు ఉన్నా న్యాయస్థానాలు, అక్కడి పద్ధతులు, పరిమితులు, చట్టాల్లో ఏముందో, చట్టపరంగా తమ హక్కు లేమిటో తెలుసుకోవడం... లాంటి విషయ సేకరణకు భయపడి తమ హక్కులనే వదులుకునే వారు ఎందరో? ఇటువంటి పరిస్థితులలో స్త్రీలకు అండగా ఉండి న్యాయపరమైన సమస్యల పరిష్కారానికి వారి యొక్క హక్కుల సాధనకు, చట్టపరంగా అండగా ఉండి కోర్టులో కేసు/దావాను వేసే సమయంలో కోర్టు ఫీజు చెల్లించ కుండ రాయితీని పొందవచ్చును. ఉచితంగా న్యాయ సేవ అందుకోవచ్చు. ఇలా ఉచిత న్యాయ సేవలను పొందడానికి ఏర్పాటు అయిన చట్టమే “legal services Authority Act 1987. కొద్దిపాటి సవరణలు 1995లో జరిగిన ఈ చట్టం పూర్తి స్థాయి అమలులో ఉంది.

ఈ చట్టం ప్రకారం ఆర్థికంగా బలహీనులైన వారికి, ముఖ్యంగా స్త్రీలు, బడుగువర్గాల వారికి ఉచిత న్యాయ సహాయం అందించ బడుతుంది. మనదేశంలో ఏ ఒక్కరూ కూడా ఆర్థిక స్తోమతలేని కారణంగా న్యాయస్థానాన్ని ఆశ్రయించలేక పోయామని బాధపడకుండా వుండడానికి, ప్రతి ఒక్కరూ న్యాయ స్థానాన్ని ఆశ్రయించే హక్కును పొందడానికీ ఈ చట్టాన్ని రూపొందించడం జరిగింది. అంతేకాదు జాతీయ స్థాయినుండీ జిల్లా స్థాయి వరకూ సత్వర న్యాయం అందించడానికి అవసరమైన యంత్రాం గాన్ని కలిగిఉంది 'లీగల్ సర్వీసెస్ అథారిటీ'. అంతేకాదు. 'లోక్ అదాలత్‌లను' నిర్వహించి సత్వర న్యాయ పరిష్కారాలను కూడా ఈ అథారిటీలు సూచిస్తున్నాయి. లోక్ అదాలత్ న్యాయశాస్త్ర కోవిదులు న్యాయమూర్తులు గానూ, న్యాయ వాదులుగా ఉండి ఇరు పక్షాలకు సయోధ్య కుదిర్చి వారి అంగీకారంతో కేసులను పరిష్కరిస్తున్నాయి.

స్త్రీలు తమ వ్యక్తిగత, కుటుంబ ఆస్తి, మనోవర్తి లాంటి హక్కులకు విఘాతం కల్గినపుడు ఈ చట్టం ద్వారా న్యాయ సహాయాన్ని పొందవచ్చును. అంతేకాదు స్త్రీపైన వారికి తెలియకుండానే అనేకమైన కేసులు కోర్టుల్లో దాఖలు అయి సమన్లు వస్తూ వుంటాయి. అటువంటి సందర్భాల్లో కూడా వెంటనే తమ జిల్లా కోర్టు ప్రాంగణంలోని లీగల్ సర్వీస్ అథారిటీని సంప్రదించి తగు సూచనలను, సలహాలనూ పొందవచ్చును.

ప్రతి జిల్లాలోనూ జిల్లా కోర్టు ప్రాంగణంలో ఏర్పాటు కాబడి అందరికీ అన్ని పనిదినాలలోనూ అందుబాటులో వుంటాయి. క్రింది కోర్టు వ్యవహారా లలోనే కాక, హైకోర్టు, సుప్రీంకోర్టుల పరిధిలో కూడా ఈ సేవలు విస్తరించి వున్నాయి. న్యాయస్థానాలలో ఫీజులను వారే చెల్లించి, న్యాయవాదులను కూడా అథారిటీ ఏర్పాటు చేస్తుంది. మహిళలు నిర్భయంగా ఉచిత న్యాయ సహాయాన్ని పొందే హక్కుని ఈ చట్టం ద్వారా నిస్సందేహంగా పొందగలరనడంలో ఎటువంటి సందేహంలేదు.

## శ్రీమతి నన్నపనేని రాజకుమారి గారు

చైర్‌పర్సన్

రాష్ట్ర మహిళా కమిషన్

ఆంధ్రప్రదేశ్



**విషయము:- తూ.గో. జిల్లా రామచంద్రాపురం మండలం పెదతాళ్ళపాలెం గ్రామంలో పప్పుల ఆదిలక్ష్మి మరణం పై నిష్పాక్షిక విచారణ జరుపుట, దోషులను అరెస్టు చేయుట మరియు నిర్లక్ష్యంగా వ్యవహిరించిన పోలీసు అధికారులపై చర్యలు గురించి..**

**ఆర్యా,**

16సం॥ల ఆదిలక్ష్మి పెదతాళ్ళపాలెం గ్రామంలో మాజీ ఎంపిటిసి కట్టా రాధాకృష్ణ ఇంటిలో పాచిపనులు చేస్తూ జూన్ 8వ తేదీన అనుమానాస్పదంగా మృతి చెందింది. దానిపై పోలీసులు మరియు ఎంపిటిసి వ్యవహరించిన తీరు వలన అనేక అనుమానాలు కల్గుతున్నాయి. జరిగిన విషాదంతో తల్లిదండ్రులు షాకుకు గురయ్యారు. ఆ కుటుంబం నివాసముండే గుడిసెలో ఉరి వేసుకోవడానికి తగిన ఎత్తు లేకపోయినా ఉరి వేసి ఉండడం, ఎవరో చంపేసి వేలడదీశారన్న అనుమానాలు గ్రామస్థులకు ఏర్పడ్డాయి. సాక్ష్యాలు లేకుండా చెయ్యాలని మాజీ ఎంపిటిసి రాధాకృష్ణ శవాన్ని దహనం చేయాలని సాంప్రదాయం కాకపోయినా పట్టుబట్టారు.

రాధాకృష్ణ కుమారుడు బాబి, అతని స్నేహితులు జూన్ 6,7 తేదీలలో హైదరాబాదు నుండి పెదతాళ్ళపాలెం గ్రామం వచ్చారని 7వ తేదీ రాత్రి బ్రాందీ సీసాలు తెప్పించుకున్నారని ఆదిలక్ష్మి తల్లిదండ్రులకు తెలియ వచ్చింది. వారి కుమార్తె పై బాబి అతని స్నేహితులు అత్యాచారం చేసి ఉండవచ్చన్న అనుమానం గ్రామస్థులకు, తల్లిదండ్రులకు రావడంతో మరుసటి రోజే ధర్నా నిర్వహించగా పోలీసువారు తక్షణం అరెస్టు చేస్తామని చెప్పారు. కానీ వారు స్పందించకపోవటంతో ఈ నెల 24వ తేదీన జిల్లా పోలీసు సూపరింటెంట్‌కు విన్నవించడమే కాక ఆ మేరకు పిటీషన్ కూడా అందజేసి ఉన్నారు. పోస్టుమార్టం రిపోర్టు మేరకు పరిశీలన చేసేందుకు పోలీసు వారు సిద్ధమైనట్లుగా మహిళా సంఘాలకు మరియు బాధిత కుటుంబానికి అర్థమవుతున్నది.

ఈ కేసులో యుక్త వయస్సులో ఉన్న అమ్మాయి అకారణంగా చనిపోయిన నేపథ్యంలో అత్యాచారం జరిగిందా? చంపేసి వేలాడదీశారా? అని పోలీసులు ఏమాత్రం పరిశోధన చేయలేదని తెలుస్తున్నది. ఆధారాలను కూడా సేకరించడానికి పూనుకోలేదు. "అటు ఇటు ఎవరూ లేరు కానిచ్చేయండి" అంటూ పోలీసులు తల్లిదండ్రులను, గ్రామస్థులను శవం దగ్గరకు కూడా రానివ్వకుండా పంచనామాను పక్కదారి పట్టిస్తూ వ్యవహరించారు. ఇప్పుడు పోస్టుమార్టం రిపోర్టుకోసం వేచి చూడటం కూడా అదే నిర్లక్ష్య వైఖరిని తెలియజేస్తుంది. పోస్టుమార్టం రిపోర్టు సక్రమంగా వచ్చేందుకు డాక్టర్ల బృందంతో మరో సారి రీపోస్టుమార్టంకు ఆదేశించవలసిందిగా కోరుచున్నాము.

జరిగిన ఈ ఘటన పై తక్షణం స్పందించాలని మహిళా సంఘం రాష్ట్రకమిటీ విజ్ఞప్తి చేస్తుంది. సాక్ష్యాధారాలను మాఫీ చేసేందుకు తోడయిన పోలీసులపై చర్య తీసికోవలసిందిగా కోరుతుంది. రాధాకృష్ణ, అతని కుమారుడు, స్నేహితులను తక్షణం అరెస్టు చేయాలి. నిజాయితీ గల అధికారులతో దర్యాప్తు బృందాన్ని ఏర్పాటు చేయాలి. కేసు విచారణలో కోర్టు పర్యవేక్షణ ఉండేట్లు చర్యలు తీసుకోవాలి. నిరుపేదలైన ఆదిలక్ష్మి తల్లిదండ్రులకు 10లక్షలు నష్టపరిహారం ఇచ్చి రాష్ట్ర ప్రభుత్వం ఆదుకోవాలి.

మహిళా కమిషన్ చైర్ పర్సన్ అయిన మీరు ఆ గ్రామాన్ని సందర్శించి బాధిత కుటుంబానికి భరోసా ఇవ్వవలసిందిగా కోరుతున్నాము. నిర్లక్ష్యంగా వ్యవహరించిన పోలీసు అధికారులపై తగు చర్యలకు సిఫారసు చేయవలసిందిగా కోరుతున్నాము.

**ఐద్వా, ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర కమిటీ**

పుస్తక సమీక్ష

# మ్యూజిక్ డైస్

- అరుణ్ సాగర్




"ఆనకట్టలు ఆధునిక దేవాలయాలు" అన్నారు నెహ్రూ. అయితే ఇప్పుడు ఆ పే ఆనకట్టలు శవాల దిబ్బలకు నిలయాలు అవుతున్నాయి. అభివృద్ధి పేరుతో కట్టిన ఆనకట్టల వల్ల కొన్ని వేలగ్రామాలు కనుమరుగు అయ్యాయి... అవుతున్నాయి. క్రీస్తు పూర్వం ఆరో శతాబ్దంలో మొదలైన మెసపుటేమియా నిర్మాణం వల్ల లక్షలాదిమంది అభివృద్ధి చేదుఫలం చవి చూసారు. ఇప్పుడు పోలవరం కట్టడం వలన లక్షా పది వేల ఎకరాలకు పైగా సాగు భూమి మూడు వందల గ్రామాలు, మూడు రాష్ట్రాలలో మూడు లక్షలకు పైగా నిర్వాశితులు అమాయకంగా మేము ఇక్కడే పుట్టాం. ఈ మట్టిలోనే కలిసి పోవాలి అంటున్నారు.

అలా తాము పుట్టిన మట్టినుండి, తాము కౌగిలించుకున్న చెట్టు నుండి తన పాదాలను మెలమెల్లగా ముద్దాడిన నీటి నుండి... తమ జీవన సంగీతం నుండి, తమ సాంస్కృతిక నేపథ్యం నుండి.. ఒక మనిషి దూరంగా జరిగి, చివరకు కనుమరుగైపోయి, ఒడ్డున పడిన చేపపిల్లలా దు:ఖపడడం కంటే విషాదం ఎక్కడ ఉంటుంది? ఈ నెల పరిచయం చేయబోతున్న అరుణ్ సాగర్ రాసిన "మ్యూజిక్ డైస్"లో రూపు దిద్దుకున్న విషాదం ఇదే అభివృద్ధి జగన్నాథ రథచక్రాల కింద పడి నలిగిపోతున్న మూల వాసుల ఆంతరంగిక వేదనకి అక్షర రూపం మ్యూజిక్ డైస్ కవిత్వ సంకలనం.

ఈ విశ్వంలో చెట్టూ, పిట్టా, మనిషీ.. ఏదీ ఎవరూ శాశ్వతం కాకపోవచ్చు. కానీ సంగీతం మరణించదు. ఆకుల గలగలల లోనే నీటి తరగల తళతళలలోనో, మేఘాల సవ్వడిలోనో.. మెరుపుల తీగల్లోనో, ఎక్కడో ఒక చోట సంగీతం తనను తాను ఆవిష్కరిం చుకుంటుంది. అలాంటి ఒక పాట... ఒక నదీమతల్లి గర్భంలో పుట్టి న ఒకపాట.. ఒక అడవి తల్లి ఒడిలో ఊయలూగిన ఒక పాట.. ఎలా మరణించ బోతోందో మనసుని కదిలించేటట్లు చెప్తాడు అరుణ్ సాగర్.

రాజ్యం తలచుకున్నప్పుడు ఆదివాసీల బడుగు జీవితాలు ఎంత?? వారి అస్తిత్వ మెంత?? అస్తిత్వ రాజకీయాల యుగంలో అస్తిత్వం కోల్పోతున్న ఆదివాసీల గోడు ఎవరు పటించుకుంటారు?? ఒక్క కవులు తప్ప.. ఇంతకీ ఏ కవి అయినా ఏం చేస్తాడు. ఆక్టేవియో పాజ్ భాషలో చెప్పాలంటే కవులు గోడలకి చెవులు ఇస్తారు. మూగవాడికి మాటనిస్తారు. అలా మూగబోయిన ఆదివాసీ గొంతులకి అక్షర రూపం ఈ పుస్తకం.

అరుణ్ సాగర్!!! ఒక సంపాదకుడిగా, ఒక సీనియర్ పాత్రికేయుడిగా, కవిగా, కథకుడిగా చిన్న వయసులోనే మనల్ని వదిలి వెళ్ళిన అమరుడిగా చిరపరచితం. కానీ లోలోపల ఆయన అసలు సిసలు ఆదివాసి. ఒక నిర్వాసితుడు. పాత్రికేయ వృత్తిలో పునరావాసం పొంది... ఆధునిక వేషధారణలో మగ్గిన ఒక విస్తాపితుడు. "మ్యూజిక్ డైస్" పేరుతో వచ్చిన ఈ సంకలనంలో అరుణ్ సాగర్ ఒక హెచ్చరిక చేసాడు. రాష్ట్ర పునర్విభజన చట్టం వచ్చాక ఆంధ్రప్రదేశ్ నాయకులకు పరప్రదాయినిగా మారిపోయిన పోలవరం నేపథ్యంలో ఆయన నిర్వాశితులవుతున్న తన లక్షలాది ఆదివాసి మిత్రుల ఆఖరి వాక్యాన్ని తన గొంతుతో వినిపించేప్రయత్నం చేసాడు.

"వృష్ప విలావమెా! బతుకు విషాదమో.. జనమే పోరాడుతున్న చోట కనీసం గొంతయినా కలపక పోవడం నేరం. కవితకు ఆచరణ సాటిరాదు. అయితే గియితే ఒక సహానుభూతి.. ఒక మద్దతు ప్రకటన.. ఒక విదాన అనుసరం. ఒక ధైర్యవచనం. ఒక నినాద రచన. ఇది మరణిస్తున్న పాటను చూస్తూ వ్యథ లోతుల్లోకి కూరుకుపోతున్న హృదయం"

ఇదీ అరుణ్ సార్ పుస్తకం మొదట్లో చెప్పుకున్న కన్‌ఫెస్. ఈ కన్‌ఫెస్ ఇప్పుడు కేవలం ఆదివాసీలకు మాత్రమే కాదు. సమస్త ప్రజానీకానికి కావాలి. లేకపోతే ఈ అభివృద్ధి

నమూనా మొత్తం సమాజానికి డెత్ సెన్‌టెన్స్‌గా మారక తప్పదు.

" మాయా మేయమగు
మైదానం కమ్మిన ఇనుప తివాచీ
ఆపాద సంస్కృతి అనగా సాంఘీక ఆటవికత...
బతుకు పృధక్కిరణ చెందింది...
ఒకనాటి రేలపాట పరీవాహక ప్రాంతమిది
ఈ ఎడారిలో వనం కోసం
అంజనం వేయాలి."

అంటూ..
ఇప్పుడు,
మా ఊళ్ళ కెళ్తే
చెప్పలేనన్నా.. మన్నించు
దు:ఖంతో గొంతు పూడుకు పోతోంది..

అంటూ అరుణ్ చెప్తుంటే.. పాఠకుల మనసు బరువెక్కిపోతుంది.

భద్రాచలం నుండి పాపికొండలు వెళ్ళేటప్పుడు ఎప్పుడైనా కూనవరం దాకా బస్సులో వెళ్తే.. ఆ అందాలు మాటల్లో చెప్పలేం. ఎర్రటి పగడాల్లా ఆరబోసిన మిరప కళ్ళాలు.. రహదారి వెంట బారులు బారులుగా నడిచి వెళ్ళే గిరిజన స్త్రీలు.. విల్లంబులు ధరించి ఆడవిలోకి నడిచి వెళ్ళే యువకులు.. ఈ శబరీ సంగమ స్థలం సొగసులే వేరు. వెదురు పొదల గుసగుసలు.. విప్పసారా ఘుమఘుమలు.. ఇవన్నీ ఇక ముందు కేవలం జ్ఞాపికాలే అవుతాయంటే వకరి మనసైనా భోరు మనకుండా ఉంటుందా..

"మూలన పొగాకు బేళ్ళు
ఎండిపోయిన తునికాకు విస్తళ్ళు
చిట్టిలు కట్టి, కట్టుకున్న ఇళ్ళు
నిను పెంచి పెద్దచేసిన ఇళ్ళు.."

ఇప్పుడు ఆనకట్ట మెట్ల మీద జ్ఞాపకంలా కూలబడిపోతుంటే, గుండెను ఎవరో కోస్తున్నట్లు ఉంటుంది. దు:ఖం తీవెలాగా సాగి, ఇళ్ళనిండా, కళ్ళనిండా, నీళ్ళు నిండిన దృశ్యాన్ని మన హృదయ ఫలకం మీద ముద్రిస్తుంది.

సీదర సెంద్రయ్య అనే స్నేహితుడి గురించి రాసిన స్మృతి గీతం చదివాక చెమర్చని కళ్ళు బహుశా ఉండవు. క్షణంలో అనుభూతి ఎండిపోయి మన మనసు గ్రీష్మ గోదారిలో మిగిలిపోతుంది.

"వాడి కాళ్ళ కింద మట్టి
నీటిపాలయితే నది కన్నీటి పాలు
కాకుండదా..
కడలిలోనన కలవకుండా ఆనకట్టకు
అడ్డం పడకుండా ఉంటదా.. అమ్మ గదరా
మరి..
గోదారమ్మ కదరా...."

అంటూ ఒక పాజిటిక్ ఆశను ఒకచోట మనలో రేకెత్తిస్తాడు అరుణ్. అంతలోనే.. చెట్టుపుట్టలు కూలుస్తున్న ఒక పొక్లయిన్ గుండెచ్చె బరువెక్కి మొరాయించింది. ఒక మట్టి పెళ్ళ పెకిలించలేక కూలబడింది. సాయిల్ టెస్ట్.. మట్టినింపిన పరీక్ష నాళిక రక్తములో చెమ్మగిల్లింది.

వాగులు వంకలు ఏరులు పారులు భోరున నుడులు తిరిగి దు:ఖపడి పెగిలిపోతున్నవి..

అంటూ అడవితల్లి తరపున మరణ శోకాన్ని వినిపిస్తాడు.

పాటల్ని చంపేసి, ప్రకృతిని చంపేసి, నిలబడడానికి నీడలేకుండా చేసుకుంటూ, విస్తరిస్తున్న మైదానపు మోడర్న్‌మాన్ ఎడారితనంపై పసీనాన్ని పచ్చదనాన్ని వదులుకోలేని అడవిబిడ్డల తరపున దు:ఖపు సూరీడులా వకాల్తా పుచ్చుకుని చివరికి రామయ్య తండ్రి దగ్గరకు వెళ్తాడు అరుణ్ సాగర్.

"రామయ్య తండ్రి
నీ అరణ్యాన్ని
లేడిపిల్లల్ని అడవి బిడ్డల్ని
నీపాదాలు ముద్దాడే పాపికొండల్ని
రేపోమాపో రెవెన్యూ రికార్డులనుండి
తొలగిస్తారు. రామా ఇలారా నాపక్కన
కూర్చో నాతోకలిసి ఈ గుట్ట మరణ
వాంగ్మూలాన్ని విను. దమ్మక్క పెడుతున్న
శాపనార్థాలు విను. వినరా విను
సీలేరు ఒడ్డున విరుగున్న విల్లు
ఫెట ఫెటేల్ ద్వానాల్ విను.. వినరా
విను..

అంటూ.. రాముడికి మరణ
వాంగ్మూలం వినిపించే ప్రయత్నం
చేస్తాడు.

జాతుల్ని, వాటి సంస్కృతుల్నే కాదు. ప్రకృతిని, పర్యావరణాన్ని అభివృద్ధి పేరుతో ద్వంసం చేసే పాలకుల దళారీ చర్యలమీద ఈ రచయిత ఎదో ఒక కవిత రాసి ఊరుకోలేదు. ఒక సంకలనమే తెచ్చాడు. ఇది కేవలం అరుణ్ సాగర్ మాత్రమే చేయగలడు. ఎంత ఆవేదన.. ఎంత పోరాట పటిమ లేకపోతే ఇంత గొప్ప పని చేయగలడు??? అమర వీరుల స్తూపం ముందు ఎగురుతున్న ఎర్ర జెండాకి పిడికిలెత్తి లాల్‌సలాం చెప్తూ సగర్వంగా ఫోటో వేసుకుని తన మ్యూజిక్ డైస్ పుస్తకాన్ని "పోడు కోసం గూడు తూనికాకు కోసం అటవీ హక్కుల కోసం జెండాలై ఎగిరిన తల్లులకు తండ్రులకు అక్కలకు అన్నలకు" అంకితం ఇచ్చిన అరుణ్‌సాగర్ భౌతికంగా మనముందు లేకపోయినా.. కవిత్వంగా పరిమళిస్తూనే ఉంటాడు.

- ఉమామహేశ్వరి నూతక్కి

# ఉద్యమాల బాటలో...



**డ్వాక్రాపై :** డ్వాక్రా మహిళలకు తెలుగుదేశం ప్రభుత్వం హామీ ఇచ్చి ఋణమాఫీ మొదటి విడత 30,0000రూ॥లు 30% గ్రూపులకు ఇంకా ఒక్క రూపాయి కూడా రాని పరిస్థితి. ఋణం పొందిన గ్రూపులు బ్యాంకులకు చెల్లించవలసిన పాత ఋణం ఏమైనా ఉంటే వాటిని తగ్గించుకుని మిగిలినది మాత్రమే ఇస్తున్నారు. ఋణం ఇచ్చినట్లు ఇవ్వటం దాంట్లో వడ్డీకింద, బకాయిలు కింద కోతపెట్టడం వల్ల అందే కొద్ది మొత్తం ఏమాత్రం ఉపయోగపడే పరిస్థితి లేదని ఋణం పొందిన మహిళల బాధ. ఋణం పొందిన గ్రూపులు ఈ విధంగానూ రాని గ్రూపులు అసలు రాక సమస్యలు ఎదుర్కొంటున్నారు. డ్వాక్రా మహిళల ఋణ సమస్యలపై తూర్పుగోదావరి అమలాపురంలో 110మందితో సదస్సు, కర్నూలు జిల్లాలో 500మందితో సదస్సు జరిగింది.



**ధరలపై:** కర్నూలు, అనంతపురం జిల్లాల్లో కూరగాయలు, నిత్యావసర వస్తువుల ధరల పెరుగుదలకు నిరసనగా వినూత్నంగా ప్రదర్శన, నిరసన కార్యక్రమాలు జరిగాయి.

**మహిళా కమిషన్ విధానపత్రంపై:** మహిళా కమిషన్ విడుదల చేసిన విధానపత్రంపై మహిళా సంఘాల ఆధ్వర్యంలో చర్చా కార్యక్రమం జరిగింది. మహిళా సంఘాలతోనూ , ఆసక్తి కలిగిన నిపుణులతోనూ, బృందాలుతోనూ చర్చలు నిర్వహించటం ద్వారా సరియైన అవగాహనతో ముసాయిదా రూపొందించటానికి అవకాశముంటుందని మహిళా సంఘాల ప్రతినిధులు అభిప్రాయపడ్డారు. జాతీయ మహిళా కమిషన్ విడుదల చేసిన విధాన ప్రకటనలో ఆచరణాత్మక ప్రతిపాదనలు లేవని, విస్తృతంగా చర్చ జరిగి సమగ్రంగా రూపొందాలంటే ప్రాంతీయ భాషల్లో కూడా ఈ డాక్యుమెంట్‌ను అందుబాటులో ఉంచవలసిన అవసరం ఎంతైనా ఉందని అభిప్రాయపడ్డారు. రాష్ట్ర మహిళా కమిషన్ ఆధ్వర్యంలో సదస్సు ఏర్పాటు చేయటం ద్వారా దీనిపై విస్తృత చర్చ జరగడానికి, మరింత శక్తివంతమైన సూచనలు, సలహాలు అందించేందుకు అవకాశం ఉంటుందని ఈ చర్చలో పాల్గొన్నవారు అభిప్రాయపడ్డారు. డి. రమాదేవి, ఐద్వా రాష్ట్ర కార్యదర్శి, పి. దుర్గా భవాని, కార్యదర్శి, ఆంధ్ర ప్రదేశ్ మహిళా సమాఖ్య, గంగా భవాని, కార్యదర్శి, పిఒడబ్ల్యు, సాయుధ, కార్యదర్శి ఎఐఆర్‌డబ్ల్యుఒ, రాధ, అధ్యక్షురాలు, చైతన్య మహిళా సమాఖ్య, పి. సరళా కుమారి, మహిళా సత్తా, శాంతిశ్రీ, జర్నలిస్టు, డి. శమంతకమణి, రచయిత, భరత్ కుమార్, డివైఎఫ్ఐ తదితరులు పాల్గొన్నారు.

**మద్యంపై :** నివాస ప్రాంతాల మధ్య ఉన్న మద్యం షాపులతో ఎదురవుతున్న సమస్యలపై ఒంగోలు గుండమాలలో లైసెన్స్ షాపును ఎత్తివేయాలని కోరుతూ స్థానిక మహిళలు 150మంది ఎక్సైజ్ కమిషనర్ ఆఫీసువద్ద ధర్నా చేసి వినతిపత్రం ఇచ్చారు. షాపును మూసివేశారు. మద్దిపాడులో బెల్టుషాపు సమస్య పరిష్కారం కోరుతూ ఎండిఒకు అర్జీ ఇవ్వడంతో షాపు ఓనర్‌ను అరెస్టు చేశారు. పశ్చిమగోదావరిజిల్లా తణుకులో బెల్టుషాపును తొలగించాలని ఎక్సైజ్ ఆఫీసువద్ద 70మందితో ధర్నాచేయగా షాపును మూసివేస్తామని చెప్పారు.

**మానికొండ సూర్యావతి వర్ధంతి సభలు:** జులై 4 మానికొండ సూర్యావతిగారి వర్ధంతి సందర్భంగా విజయవాడ, విజయనగరంజిల్లా పార్వతీపురం, బొబ్బిలిలో సభలు జరిగాయి. ఒంగోలు టౌన్, మార్కాపురంలలో సభలు జరిగాయి.

ఐద్వా పశ్చిమ గోదావరి జిల్లా కార్యదర్శిగా మహిళా



నేపథ్యంలో అనంతపురం ఐద్వా, ఎస్ఎఫ్ఐ జిల్లా కమిటీలు ప్రత్యేకంగా కాలేజీలు, సంక్షేమ హాస్టల్స్‌పై కేంద్రీకరించి "అమ్మాయిలూ జర జాగ్రత్త" అనే నినాదంతో ప్రచారంచేస్తున్నారు. ఇప్పటికి 12 కాలేజిలు, 3 హాస్టల్స్‌లో సదస్సులు నిర్వహించారు. కాలేజిల యాజమాన్యం ఎంతో ఉత్సాహంగా ఈ సదస్సులు నిర్వహించేందుకు ముందుకు వచ్చారు. మొత్తంగా 4000మంది విద్యార్థులు ఈ సదస్సుల్లో పాల్గొన్నారు. 15,000 కరపత్రాలు ఈ సందర్భంగా పంపిణీ చేశారు.

సమస్యలపై విశేష కృషి చేసిన నాయకురాలు టి. ప్రభావతి గత సంవత్సరం అనారోగ్యంతో మరణించారు. ఆమె ప్రజానాట్యమండలి కళాకారిణిగా, మహిళా బుర్రకథ దళం సభ్యులుగా అనేక ప్రదర్శనలు చేశారు. ప్రథమ వర్ధంతి సభ పాలకొల్లులో పిఎన్ఎం, ఐద్వా ఆధ్వర్యంలో 250మందితో జరిగింది. ఐద్వా రాష్ట్ర అధ్యక్షురాలు బి. ప్రభావతి ముఖ్య అతిధిగా పాల్గొన్నారు.




**కెప్టెన్ లక్ష్మి సెహగల్ వర్ధంతి సభలు:** అజాద్ హింద్ ఫౌజ్‌లోని ఝాన్సీలక్ష్మిబాయి రెజిమెంట్‌కు కెప్టెన్‌గా స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొని, ప్రజా వైద్యురాలిగా పేదప్రజలకు వైద్యం అందించడమే కాక ఐద్వా ఫౌండర్ మెంబర్‌గా తుది శ్వాస వరకు కృషి చేసిన కెప్టెన్ లక్ష్మి సెహగల్ 4వ వర్ధంతి సందర్భంగా పిసిపియన్‌డిట్ యాక్ట్‌పై అవగాహన సదస్సులు జరిగాయి. బిజెపి ప్రభుత్వం సవరణలతో నిర్వీర్యం చేయతలపెట్టిన పిసిపియన్‌డిటి చట్టం పటిష్టంగా అమలు కావాలని, సామాజిక అంతరాలు అధిగమించాలని విజయవాడ, విజయనగరం, విశాఖ, పశ్చిమగోదావరి, అనంతపురం జిల్లాల్లో డాక్టర్లు, డిఎంహెచ్ఓ అధికారులతో అవగాహన సదస్సులు జరిగాయి. ఈ సందర్భంగా అనంతపురం కాలేజి విద్యార్థులు 1000మందితో సదస్సు జరిగింది. తూర్పుగోదావరి (కాకినాడ)లో 6 ఏరియాల్లో సదస్సులు జరిగాయి. గుంటూరులో అభ్యుదయ మహిళా కళాశాలలో 200మందితో సెమినార్ జరిగింది. ఈ సభలలో ప్రజారోగ్య వేదిక అధ్యక్షకార్యదర్శులు డా॥సుధాకర్, డా॥సురేష్, డా॥దీపిక, డా॥మాధురి, ఆయా జిల్లాల డిఎంహెచ్ఓలు, గుంటూరు జిల్లా పి.డి.(ఐసిడిఎస్),ఆర్.పద్మ, లయన్స్, శైలజ, శ్రీనివాస్ (న్యాయవాదులు) కె.స్వరూపరాణి, డి.రమాదేవి, సావిత్రి, రాజ్యలక్ష్మి, మాధవి, లక్ష్మీ(ఐద్వా) తదితరులు పాల్గొన్నారు.

**అమ్మాయిలూ జర జాగ్రత్త :** మహిళలు, విద్యార్థులపై రోజు రోజుకూ పెరిగిపోతున్న దాడులు, అత్యాచారాలు పెరిగిపోతున్న

**స్కూల్స్, హాస్టల్స్ సమస్యలపై:** రాష్ట్ర ప్రభుత్వం తీసుకున్న హాస్టళ్ళ మూసివేత నిర్ణయాన్ని నిరసిస్తూ రాష్ట్ర వ్యాప్తంగా అన్నిజిల్లాల్లోనూ విద్యార్థులు పోరాటబాట పట్టారు. ఐద్వా, ఎస్ఎఫ్ఐతో కలిసి నిరసన కార్యక్రమాలు నిర్వహించారు. విజయవాడ బొబ్బిలి ఆనందనిలయం ఎస్‌సి బాలికల హాస్టల్, సాలూరు బంగారమ్మ కాలనీ బిసి బాలికల హాస్టల్స్ ఎత్తివేతకు నిరసనగా ఎస్ఎఫ్ఐతోకలిసి 2సార్లు ఎంఆర్‌వొ ఆఫీసువద్ద ధర్నా చేశారు. కందుకూరులో బాలికల సంక్షేమ హాస్టల్ ఎత్తివేతకు నిరసనగా ఎస్ఎఫ్ఐతో కలిసి 200మందితో కలెక్టర్ ఆఫీసు వద్ద ధర్నా చేశారు. ఒంగోలు హాస్టల్‌లో సర్వే చేసి సమస్యలపై కలెక్టర్‌గారికి అర్జీ ఇవ్వడమైనది. ప॥గాదావరి పాలకొల్లు, తణుకులలో రెండు స్కూల్స్, రెండు హాస్టల్స్‌లో సర్వే చేసి సమస్యలపై మెమోరాండమ్ ఇచ్చారు. సుదీర్ఘ కాలంగా ఉన్న టాయిలెట్ల సమస్య పరిష్కారం అయింది. రాష్ట్రంలో జులై 25వ తేదీ ఎస్ఎఫ్ఐ విద్యార్థులు నిర్వహించిన దీక్షలు, ధర్నాకు ఐద్వా మద్దతు ఇచ్చింది.

**శిక్షణా తరగతులు:** విజయనగరం జిల్లా కేడర్ క్లాసులు మూడు రోజులపాటు 50మందితో జరిగాయి. విజయనగరం టౌన్-32, సాలూరు-55, బొబ్బిలి-22మందితో ఒకరోజు క్లాసులు జరిగాయి. విశాఖ జిల్లా అరకులో జిల్లా క్లాసులు 150మందితో

3రోజులపాటు జరిగాయి. 60మంది యువతులు కొత్తవారు. తూర్పుగోదావరి కాకినాడలో 80మందికి రెండురోజులపాటు క్లాసులు జరిగాయిజ అనంతపురం పుట్టపర్తిలో మూడురోజులపాటు 70మందికి క్లాసులు జరిగాయి. కర్నూలు జిల్లా క్లాసులు 60మందితో జరిగాయి. ఈ క్లాసుల్లో ఉత్సాహంగా పాల్గొన్నారు.

**స్థానిక సమస్యలపై :** ప॥గోదావరిజిల్లా పాలకొల్లులో లోవోల్టేజి సమస్య, ఆకివీడు భీమవరంలో మంచినీటి సమస్య, డ్రైనేజి సమస్యలపై అధికారులకు అర్జీలు ఇవ్వటం, గ్రామ సభలలో ఇళ్ళ స్థలాల సమస్య పైఅర్జీ ఇవ్వటం జరిగింది. కర్నూలుజిల్లాలో తాగునీరు, మరుగుదొడ్లు, రోడ్ల సమస్యలపై ఐదు ఏరియాల మహిళలను సమీకరించి మునిసిపల్ కమిషనర్ కార్యాలయం వద్ద ధర్నా జరిగింది. ఆక్వా ఫుడ్ పార్క్‌ను వ్యతిరేకిస్తూ భీమవరంలో ఇంటింటి ప్రచారం చేసి 700మంది మహిళలతో వంటా వార్పు కార్యక్రమం నిర్వహించారు.

**హింసపై:** ప॥గోదావరి జిల్లా చాటపర్రులో మహిళను అత్యాచారంచేసి చంపేసిన ఘటనలో ఐద్వా నాయకులు అధికారులతో మాట్లాడారు. 6సం॥ల బాలికపై అత్యాచారం చేయబోయిన వ్యక్తిని అరెస్టు చేయాలని డిఎస్‌పి, ఎస్‌ఐలను కలిసి అర్జీ ఇచ్చారు. విశాఖ జిల్లా గాజువాకకు చెందిన లావణ్య అనే వివాహితను అనకాపల్లిలో మద్యంతాగి వేధిస్తూ మోటారు సైకిల్‌పై వెళుతుండగా కారుతో గుద్ది చంపిన ఘటనలో బాధితులను బెదిరించి, మభ్యపెట్టి 25లక్షల రూపాయలు ముట్టజెప్పి ప్రమాదవశాత్తు జరిగిన ఘటనగా మార్చి పోలీసులు నిందితులకు కొమ్ముకాసిన ఈ ఘటనపై 2000 కరపత్రాలు పంచి పోలీసుల తీరుపై సంతకాల సేకరణ కార్యక్రమం జరిపారు. తూర్పుగోదావరి జిల్లా పెద తాళ్ళపాలెంలో ప్రజాప్రతినిధి ఇంట్లో పనిచేసే ఆదిలక్ష్మి అనే యువతిని హత్య చేసి ఆత్మహత్యగా చిత్రీకరిస్తూ ఆమె శవాన్ని ఆమె గుడిసెలో ఆత్మహత్య చేసుకున్నట్లు వేలాడదీశారు.

ఈ ఘటనలో ప్రజాప్రతినిధి కుమారుడి హస్తం ఉన్నట్లు అనుమానించిన ఆమె తల్లిదండ్రులు పోలీసులకు ఫిర్యాదు చేశారు. ఆదిలక్ష్మి కుటుంబాన్ని ఐద్వా నాయకత్వం పరామర్శించి వారికి అండగా ఐద్వా ఉంటుందని, పోస్టు మార్టం రిపోర్టును తారుమారు చేసే అవకాశాలున్నాయని గమనించి మహిళా కమిషన్‌కు, హోం శాఖామాత్యులకు వినతిపత్రం ఇచ్చి ఆ కుటుంబానికి న్యాయం జరిగేలా చూడవలసిందిగా ఐద్వా కోరింది. ఈ కేసులో ఐద్వా కలెక్టర్ ఆఫీసువద్ద, డిఎస్‌పి, ఎస్.పి. కార్యాలయాలవద్ద ధర్నాలు నిర్వహించింది. ముగ్గురిని అరెస్టు చేశారు. అసలు నిందితుడిని ఇంకా అరెస్టు చేయలేదు.

ఈ విషయమై ఇంకా అధికారులను కలిసి మాట్లాడటం జరుగుతోంది. 2,000 కరపత్రాలు పంచడమైనది. చిత్తూరులో ప్రేమించలేదని యువతిని బైక్‌తో డీకొట్టడంతో ఆమె తీవ్రగాయాలపాలవ్వటంతో ఆమెకు మెరుగైన వైద్యం అందించాలని, నేరస్తులను అరెస్టుచేసి కఠినంగా శిక్షించాలని పోలీసు అధికారులకు వినతిపత్రం ఇవ్వడమైనది. కర్నూల్ నగరంలోని వికలాంగ బాలికపై పొరుగున నివసిస్తున్న వ్యక్తి అత్యాచారం చేసిన ఘటనపై ఐద్వా జోక్యం చేసుకుని కలెక్టర్ ఆఫీసుముట్టడి కార్యక్రమం జరిపి బాలికకు మెరుగైన వైద్యం అందించాలని, నిర్భయ చట్టం కింద కేసు నమోదు చేసి కుటుంబానికి నిర్భయ నిధిని అందించాలని డిమాండ్ చేశాము.

**రిషితేశ్వరి సంస్మరణ సభ:-** నాగార్జున విశ్వవిద్యాలయం విద్యార్థి రిషితేశ్వరి ర్యాగింగ్ భూతానికి బలై సంవత్సరం అయిన సందర్భంగా విజయవాడ నగరంలోని ప్రభుత్వ జూనియర్ కాలేజిలో సంస్మరణ సభ జరిగింది. ఈ కార్యక్రమంలో కళాశాల ప్రిన్సిపల్.. ఐద్వానాయకులు రమాదేవి, శ్రీదేవి, ఝాన్సీ తదితరులు పాల్గొన్నారు.



**అస్సాం ఆదివాసీ బాలికల అక్రమ తరలింపుకు వ్యతిరేకంగా:**

అస్సాం నుండి బాలికల అక్రమ తరలింపు:

అస్సాం ఆదివాసీ బాలికలను ఉత్తర ప్రదేశ్, పంజాబ్ రాష్ట్రాలకు ఆర్ఎస్ఎస్ కార్యకర్తలు తరలించి వారికి నిర్బంధ శిక్షణతో హిందూ మతోన్మాదులుగా తర్ఫీదు ఇచ్చేందుకు తరలించడాన్ని నిరసిస్తూ ఐద్వా జిల్లా కమిటీ ఆధ్వర్యంలో ఏలూరులో ప్రదర్శన, మానవహారంగా ఏర్పడి నిరసన తెలియజేశారు. ఈ కార్యక్రమంలో ఐద్వారాష్ట్ర కార్యదర్శి డి. రమాదేవి, ప॥గోదావరి జిల్లా కార్యదర్శి డి. కళ్యాణి, ఉపాధ్యక్షురాలు జి. విజయలక్ష్మి తదితరులు పాల్గొన్నారు.

**బైబిల్ యూనివర్శిటీ మేనేజ్‌మెంట్‌పై చర్యలు తీసుకోవాలి.** విజయనగరం జిల్లా డెంకాడ మండలం బైబిల్ యూనివర్శిటీ అమ్మాయిలను లైంగికంగా వేధింపులకు గురి చేసిన పాస్టర్ సునీల్‌ను అరెస్ట్ చేయాలని డిమాండ్ చేస్తూ రాస్తారోకో చేశారు.

**టిడిపి రెండేళ్ళ పాలనపై:**

శ్రీకాకుళం జిల్లా ఐద్వా కమిటీ ఆధ్వర్యంలో రాష్ట్రంలో తెలుగు దేశం ప్రభుత్వ రెండేళ్ళ పాలన మహిళలపై ప్రభావం అను అంశముపై ఎన్‌జిఒ హాల్ లో సదస్సు జరిగింది. సదస్సులో ఐద్వా రాష్ట్ర కార్యదర్శి డి. రమాదేవి, అధ్యక్షురాలు బి. ప్రభావతి, జిల్లా ఐద్వా కన్వీనర్ లక్ష్మి తదితరులు పాల్గొని ప్రసంగించారు.

## గిరిజన మిత్ర అస్సావ్ బ్యాంకు చెక్‌పవర్ ఇవ్వాలి



అరకువేలి,డుంబ్రిగుడ, అనంతగిరి మండల పరిధిల్లో గల డ్వాక్రాస్వయం సహాయ సంఘాలకు, రైతుమిత్ర గ్రూపులకు మరియు వ్యక్తి గత ఎకౌంట్‌లను ఆర్థికంగా తోడ్పాటు అందించుట కొరకు 2000 సం॥ల్లో అస్సావ్ మాక్స్ ఏర్పాటు చెయ్యడం జరిగింది. మాక్స్ పరిధిల్లో 600 స్వయం సహాయక సంఘాల్లో సుమారు 6000 మంది డ్వాక్రా సభ్యులుగా ఉన్నారు. వారు దాచిన పొదుపు డబ్బులు సుమారు 30లక్షలు వరకు ఉన్నాయి. ఇప్పటి వరకు వివిధ డ్వాక్రాగ్రూపులకు సుమారు ఒక కోటిన్నర రూపాయిలు వరకు రుణ సహాయం అందించియున్నాది. డ్వాక్రా సభ్యులకు ఆర్థికంగ సహాయ సహకారం అందిస్తూ అస్సావ్ మ్యాక్స్ డ్వాక్రా సభ్యులకు సేవలందిస్తుంది.

ఎటువంటి ముందస్తు నోటీసులు ఇవ్వకుండా బ్యాంకును రద్దుచేయమనడం, లక్షలాది సొమ్ముని హెూల్డ్‌లో పెట్టడం, గిరిజనులే కదా ఏమిచేయలేరన్న నిర్లక్ష్యధోరణి కనబడుతుంది. సంవత్సరం న్నర నుండి బ్యాంకు లావాదేవిలను అపివేయడం వలన గిరిజన మహిళలు అనేక ఆర్థిక ఇబ్బందులకు గురౌతున్నారు. పెరిగిన ధరలతో పోటీపడలేక మరోప్రక్క అనారోగ్యాలపాలై మహిళల బ్రతుకులు చిద్రమౌతున్నాయి.

**అధికారుల నిర్లక్ష్యధోరణి :** అనేక సార్లు ఐటిడిఏ పి.ఓ, కలెక్టర్, వెలుగు ఎపిడిఓ సంబంధించిన అధికారుల్ని కలిసిన చెప్పులు అరిగిపోయాయి కాని సమస్యల పరిష్కాంకాలేదు. పొదపుచేసిన సొమ్ము 30లక్షలు, రుణమాఫీ 91.33 లక్షల రూపాయలు ఇప్పిస్తామంటారు కానీ ఆచరణలో శూన్యం.

సెల్ఫ్ హెల్ప్ గ్రూపుల ద్వారా మహిళలు సాధికారత సాధించాలని, మహిళల్ని లక్షాధికారుల్ని చేస్తానన్న ముఖ్యమంత్రి మాటలు నీటిమీద రాతలగానే మిగిలాయి. ఏడాదిన్నర నుండి అరుకులో వున్న అస్సావ్ బ్యాంకు లావాదేవీలను ఆపివేయడం వలన ఆన్‌లైన్ అయిన 379 గ్రూపుల పెట్టుబడి నిధి 91.53 లక్షలు మంజూరైన డ్వాక్రా అకౌంట్లకు వేయకుండా అధికారులు అన్యాయం చేసారు. సాక్షాతు ముఖ్యమంత్రి దత్తత మండలం అరుకువేలిలో 600 డ్వాక్రా గ్రూపులకు చెందిన 6వేల మంది డ్వాక్రా మహిళలు ఇబ్బందులు పడుతుంటే అధికారులు దున్నపోతు మీద వర్షంపడ్డ చందంగా వ్యవహరిస్తున్నారు.

గిరిజన సంఘం, ఐద్వా ఈ సమస్యపై పోరాటం చేయడం జరిగింది. పోరాటం ఫలితంగా ప్రభుత్వం వెలుగు డిఆర్‌డిఏ పి.డి సిబ్బందిని అప్రమత్తం చేసి సర్వేలుచేసి ఆగస్టు 20 నాటికి సమస్యను పరిష్కారం చేస్తామని వెలుగు సిబ్బందిఐద్వా, గిరిజన సంఘం నాయకులకు చెప్పారు.

**మాయావతిపై బిజెపి నాయకుడి వ్యాఖ్యలపై :** ఉత్తర ప్రదేశ్ బిజెపి ఉపాధ్యక్షుడు దయా శంకర్ సింగ్ యుపి దళిత నాయకురాలు మాయావతిని అసభ్య పదజాలంతో దూషించడాన్ని ఐద్వారాష్ట్ర కమిటీ తీవ్రంగా ఖండిస్తుంది. ఒక మహిళా నాయకురాలిని హీనమైన పదజాలంతో దూషించడం ఘోరమైన విషయం. బిజెపి అధినాయకత్వం జోక్యం చేసుకుని సదరు నాయకుని చర్యలు తీసుకోవాలని, వ్యాఖ్యలను వెనక్కి తీసుకోవాలని, క్షమాపణ కోరాలని, అతనిని వెంటనే అరెస్టు చేసి కఠిన చర్యలు తీసుకోవాలని డిమాండ్ చేస్తూ విశాఖ, పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరులోనూ నిరసన కార్యక్రమాలుజరిగాయి.





డ్వాక్రా గ్రూపులకు శానిటేషన్ వర్క్ కేటాయించాలని ధర్నా : విజయవాడ


తొట్టెంపూడి ప్రభావతి ప్రధమ వర్ధంతి పుస్తకావిష్కరణలో సావిత్రమ్మ, బి.ప్రభావతి : పశ్చిమగోదావరి



కెప్టెన్ లక్ష్మీ సెహెగల్ వర్ధంతి సభలో ప్రసంగిస్తున్న డా॥ఎస్.సుధాకర్ : విజయవాడ



బైబిల్ యూనివర్సిటీ మేనేజ్‌మెంట్ లైంగిక వేధింపులకు నిరసనగా : విజయనగరం



కెప్టెన్ లక్ష్మీ సెహెగల్ వర్ధంతి సభలో ప్రసంగిస్తున్న పుల్లారావు, జెవివి : ఒంగోలు



టీడీపీ రెండేళ్ళ పాలన - మహిళలపై ప్రభావం సదస్సు : శ్రీకాకుళం






మహిళా సమస్యలపై విధాన పత్రంపై చర్చ గోష్ఠి : విజయవాడ

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMV01A152 |
| పుస్తకం పేరు | చైతన్య మానవి |
| తారీఖు | 21/08/2023 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | sandhya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |